అక్టోబరు ౨వ తేది దేశమంతా
గాంధిజీని స్మరించారు.





# మిసిమి

**"All that we are is the product of what we have thought"**
**is "We are what we think." — Dammapada.**

సంపుటి 7 నవంబర్ 1994 సంచిక 76

సంపాదకుడు : డ్సాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



---

ముఖచిత్రం :

Lady Suffering the sorrows of Love, consoled by her attendants, Miniature. Chamba School, end of the eighteenth century A.D. The National Museum, New Delhi. The perspective in the traditional rhythm and appearance, whereas the perspective in the landscape back-ground is of western inspiration.

---

Printed, Published and Edited by RAVINDRANATH ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

**Editorial Nest**

Plot No: 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad - 500 033. Ph. 247717.

## Quiz

# The great soul in beggar's garb

**Mahatma Gandhi's 125th birth anniversary was celebrated this week. Try answering the following questions and see if you can get them all right.**

### Questions

1) When Mahatma Gandhi was in the seventh standard, he was late for gymnastics at school. When asked the reason he said he had been "deceived' by the clouds. However, he was not believed and punished by the Headmaster. Can you name this Headmaster?
2) Where was Gandhi greeted with the slogan : "Hang old Gandhi/on the sour apple tree"?
3) Where and in which year did Gandhi give up taking cow's milk?
4) Later, Gandhi started taking goat's milk. Can you name his favourite goat?
5) Name the first book that was written by Mahatma Gandhi.
6) In which year did Gandhi first go to prison?
7) After Gandhi returned from England after the Second Round Table Conference, he sent two watches engraved "With Love from M.K. Gandhi" to two persons there. Name them.
8) Who wrote the book Gandhi's Challenge to Christianity and dedicated it to "Mahatma Gandhi who made Jesus and His message real to me"?
9) On one day of the week Gandhi would remain totally silent. Which day was this?
10) Name the first family of Harijans to live at Satyagraha Ashram, Ahmedabad.
11) "This book marked the turning point of my life. I immediately decided to change my life in accordance with the ideals of the book", Gandhi had said. Which book was he referring to?
12) At which session of the Indian National Congress was the new Congress Constitution drafted by Gandhi adopted?

**Answers**

1) Dorabji Edulji Gimi.
2) Natal.
3) At the Tolstoy Farm in 1912.
4) Nirmala.
5) Hind Swaraj in 1909.
6) 1908.
7) Sergeant Evans and Sergeant Rogers, two Scotland Yard detectives who were assigned to guard Gandhi during his stay in London.
8) S.K. George, a Syrian Christian who was a lecturer at Bishop's College, Calcutta.
9) Monday.
10) Dudabhai, his wife and daughter.
11) Unto this Last by John Ruskin.
12) Nagpur, 1920.

***- Aseem Kumar Jha***

# భావనా లోకంలో వెన్నెల చిందులు

సత్తెనపల్లి రామమోహన్ రావు

చల్లని వెన్నెల్లో దొడ్లో చాపేసుకొని కూర్చుంటే ఏవేవో ఊహలు వస్తున్నాయి ఎక్కడెక్కడి జ్ఞాపకాలో చుట్టుముడుతున్నాయి కొబ్బరిచెట్టు ఆకుల్లో నుంచి తెల్లని వెన్నెల చారలుచారలుగా కింద పడుతోంది. ఆడ బ్రతుకే మధురం- అని ఎప్పటిదో పాత సినిమా పాట పక్కింట్లో నుంచి వినపడుతోంది పాతదయినా ఆ పాట అంటే నాకు చాలా యిష్టం. ఆడవాళ్ళ బ్రతుకులన్నీ మధురమేనా అని అడిగితే మాత్రం జవాబు నేనేం చెప్పలేను నిజానికి నా బ్రతుకులో కూడా అన్నీ చేదు అనుభవాలే తప్ప చెప్పుకోదగ్గ మధురానుభవాలు ఏమున్నాయి కనక? అయినా నాకెందుకో ఆ పాటంటే యిష్టం "నీకు ఎందుకు యిష్టమో నేను చెప్పనా ఆ పాటలో మధురం అని నీపేరే వుంది కాబట్టి నీకు యిష్టం-"అన్నాడు గిరీశంగారు ఒకసారి. ఆ మాట కూడా నిజమేనేమో . నా పేరు మధురవాణి అయినా గిరీశంగారు నన్ను మధురం అనే పిలుస్తారు. రామప్పపంతులు కూడా అలాగే పిలుస్తాడు. గిరీశం పిలిస్తే ఏమీ అనిపించదు కానీ రామప్పపంతులు అలా పిలిస్తే మాత్రం ఒళ్ళు మండిపోతుంది చుట్ట నోట్లో పెట్టుకున్నప్పుడల్లా- "పిల్లా అగ్గిపుల్ల-"అంటూ వుంటాడు రామప్ప ఫంతులు అలా అడిగినప్పుడల్లా అగ్గిపుల్ల వెలిగించి ఆయన మొహాన్నే అంటించాలన్నంత కోపం వస్తుంది నాకు. అంగడి వానికి మిఠాయి మీద ఆశలాగా నాలాంటి వాళ్ళ కోపాలు ఆవేశాలు లోపల అణుచుకోవలసిందే కాని పైకి ప్రదర్శించే వీలుండదు కదా.

అయినా ఒకరు పిలిస్తే యిష్టంగాను మరొకరు పిలిస్తే కోపంగాను ఎందుకుంటుందో- ఎవర్నయినా అడిగి సోదె చెప్పించుకోవాలి ఎవర్నో ఎందుకు- అడగాలి కాని పూజారి గవరయ్య యిటువంటి సోదెలు చాలా చెబుతాడు పైన చందమామ పుచ్చపువ్వులా వెన్నెలలు కురిపిస్తుంటే యివాళెందుకో నా ఆలోచనలు యిలా సాగుతున్నాయి..

వెన్నెల మహాత్మ్యమో ఏమో కాని చందమామను చూస్తూ కూర్చుంటే ఊహలకు రెక్కలొచ్చినట్లు అనిపిస్తుంది అందుకే కావచ్చు పూర్వకవులు, భావకవులు, ఆధునిక కవులు, జానపద కవులు - అంతా వెన్నెల కవిత్వం వొలకపోసిన వారే. ప్రసిద్ధి చెందిన కవులు వెన్నెల పద్యాలు గుప్పిస్తే అనామకులైన జానపద కవులు వెన్నెల పదాలు వెలయించారు పదమైనా పద్యమైనా విషయమే వెన్నెల వర్ణన కాబట్టి హృదయంగమంగా వుండి మనసుకి హత్తుకోటం ఎటు తిరిగీ తప్పదు

"దొలుకాడు మిన్నేరు వెలివిరిసెనోయని లీల సురాంగన లోలలాడ, బాదరసం బుర్వి బరగెనోయని సిద్దనికరంబు కలశమున్ నించుకొనగ, నఖిల జీవుల కానందమతిశయిల్ల నచ్చ వెన్నెల విమలమై యలరికాసె-"అని నన్నెచోడ మహాకవి తన కుమార సంభవ కావ్యంలో వెన్నెలను రమ్యంగా వర్ణించాడు శ్వేత గంగా ప్రవాహంలానే కాక తెల్లని పాదరసంలా కూడా వెన్నెల జారుతూ అఖిల జీవుల్ని ఆనందపరవశుల్ని చేసిందిట నేపథ్యం యింత మనోహరంగా వున్నప్పుడు ఎంతటి ముక్కంటి అయినా ప్రసన్నం కాకుండా వుంటాడా?- అదే జరిగి పార్వతి తపస్సేకాక కడుపు కూడా పండి కుమారస్వామి ఉదయించడం జరిగింది. ఇంత జటిలంగా కాకపోయినా తేలికమాటలలోనే అయినా పలెపడుచులు యింతకంటే

హృద్యంగా వెన్నెలను కీర్తించగలరు మధురమైన ఆ వెలుగులను కళ్ళకు కట్టినట్లు వర్ణించనూగలరు. "నెలవంక పలకలో నీరూపె గీతురా, తల వంచి సెలయేట ఆ రూపె చూతురా-" అంటుంది నండూరివారి ఎంకి చందమామ చలువలో ఆమెకు నాయుడు బావే కనిపిస్తాడు. సెలయేటి నీటిలో ప్రతిఫలించే జాబిల్లిలో కూడా మళ్ళీ ఆమెకు ఆ బావే దర్శనమిస్తాడు నెలరాజు తన రాజు రూపంలోనే కనిపిస్తాడు ఏ ప్రేమికకయినా కాని యీ రోజులలో పట్టణ వాసులకు వెన్నెలకు మధ్య ఎడం పెరిగిపోయింది ఎలక్ట్రిక్ దీపాల, నియోన్ లైట్ల కృత్రిమ వెలుగులలో వెన్నెల వెలాతెలా పోతోంది. ఆకాశహర్మ్యాలలో నివసించే వారికి అసలు వెన్నెల వెలుగులే కనిపించవు అటువంటి భవనాలలో నివసించే తల్లులు- టి వి చూపిస్తూనో టేప్‌రికార్డరు వినిపిస్తూనో పిల్లలకు అన్నం తినిపించాలి తప్పిస్తే- చందమామ రావే జాబిల్లి రావే- అంటూ వెన్నెల మావయ్యను పిలుస్తూ పిల్లలను మురిపిస్తూ అన్నం తినిపించే వీలు లేదు. అందుకే పరాభి -"జాబిల్లీ నిజంగా నీవిచ్చేట బొత్తిగా అనవసరం సుమీ, మా కళ్ళు మురిసిపోవును యలక్ట్రిక్కు దీపాల ధావళ్యమునకు-" అన్నారు అంతతో కూడా ఊరుకోకుండా -"శశీ కవీశ్వరు లఖండంగా వినుతించినట్టి నీ గుండ్రని మోమందపు తరహా సయితము మాకేమి నచ్చనే నచ్చదు-"అని కూడా అంటారు పైకి అలా అంటున్నా కృత్రిమపు విలువల యెడల కవిగారికి కల వైమనస్యమే ఆ పలుకులలో అంతర్గతంగా ధ్వనిస్తుంది.

ఆ సంగతెలా వున్నా గిరీశంగారు మాత్రం నా మొహాన్ని చందమామతోనే పోల్చి కవిత్వాలల్లాడు ఆకవిత్వాన్ని అడ్డం చేసుకునే నేనూ తనూ కలిసి తీయించుకున్న ఫోటోగ్రాపులకు డబ్బు యివ్వకుండానే అడగడానికొచ్చిన పొటిగరాప్పంతులుగారి బంట్రోతును దబాయించి పంపేస్తాడు. గిరీశంగారు విజయనగరంలోని బొంకుల దిబ్బ దగ్గర వెన్నెల షికార్లు చేస్తూ నన్ను గురించే తలుచుకుంటూ -"ఫుల్లుమూను నైటటా జాసమిన్ను వైటటా మూనుకన్న మొల్లకన్న నీదు మోము బ్రైటటా-"అంటూ కవిత్వాలల్లుతుంటే పానకంలో పుడకలా ఫోటోగ్రాపు పంతులుగారి నౌకరొస్తాడు "నేను పొటిగరాప్పంతులుగారి నౌఖర్నండి లెక్క జరూరుగుందండి పొటిగరాపుల ఖరీదు యెంటనే యిప్పించమన్నారండీ-"అంటాడు నౌకరు అంతగా గొంతుచించుకుంటున్నా గిరీశంగారు వినిపించుకోనట్లే వెన్నెల కవిత్వం వొలకపోస్తూ వుంటాడు "యంతమందిని పంపినా యిచ్చారు కారటండీ నేనాళ్ళలాగూరుకుండే వోణ్ణి కానండి నిల్చున్న పాట్న మొల్లో సెయ్యేట్టి వసూలు చేసుకోకుండా వదల్నండి-"అంటూ బంట్రోతు నిక్కచ్చి చేస్తే కాని మొండి ఘటం గిరీశంగారు ఆకాశంలో నుంచి కిందికి దిగిరాడు అయితే డబ్బు యివ్వకుండానే, ఓ హవానా చుట్టతో బంట్రోతుకు బురిడీ యిచ్చి పంపిస్తాడనుకోండి- అదీ వేరే విషయం ఏమయినా మల్లెపూవులా మెరిసిపోయే చందమామకంటే నా మొహమే బ్రైట్ అన్నందుకు- చెప్పొద్దూ నాకు ఒక విధంగా సంతోషమే కలిగింది. పొగడ్తలకు ఉబ్బిపోని వారెవరుంటారు చెప్పండి?

పరమాత్ముడు తలకొక రూపై తోచినట్లు వెన్నెలను వర్ణించేటప్పుడు కూడా కవులు వారి వారి అభిరుచుల్ని బట్టి తలకొక మాదిరిగా చెబుతూ వుంటారు. భోజన ప్రియుడయిన ఓ కవిగారికి వెన్నెల తెల్లని గడ్డ పెరుగులా తోస్తుంది పెళ్ళాం కంచంలో గడ్డ పెరుగును గరిటతో వడ్డించినప్పుడల్లా- "ఆహా ఏం తెలుపు వెన్నెల తెలుపు, చందమామను తుంచి కంచంలో వడ్డించినట్లు వుంది-"అని మురిసిపోయేవాడుట దానధర్మాల్లకు పెట్టింది పేరయిన రాయనిభాస్కరుని అన్న సత్రంలో నిత్యం భోజనం చేసే ఓ కవిగారికి ఆ సత్రంలో వడ్డించే పెరుగే వెన్నెల గుజ్జులా తోస్తుంది "బెట్టు నెయ్యి రాజాన్నము లొప్పుబప్పు పదియారు

తెరంగుల కూరగాయలున్, వెన్నెల గుజ్జు బోలు దధి వేసవికాల మూరితంబుగన్-"అంటూ మురిసిపోతాడు. ఏ పాటు పడినా సాపాటుకే అన్న దివ్యరహస్యాన్ని ఎరిగిన వాళ్ళు ఏ ప్రసక్తినయినా భోజనాల జల్ల దగ్గరకే యీడ్చుకొస్తారు అలాంటివారికి జాబిల్లి జున్ను ముక్కలా కనిపించటంలో అబ్బురమేముంటుంది?-

చంద్రబింబం నుంచి వెన్నెల జాలువారినట్లు రసవత్కవుల భావనా వీధులలో నుంచి కావ్యకళలుద్భవిస్తాయంటూ చక్కని పోలిక తెచ్చాడు బొడ్డుచెర్ల తిమ్మకవి "సరసశీతలమగు సుధాకరుని మేన నమృతధారా ప్రవాహంబు లడరు కరణి, బ్రమదకౌతుక మేదుర భావవీధి గవుల కుదయించు కమ్మని కావ్య కళలు-"అంటాడీయన

ఇలాంటివన్నీ నేచెబుతుంటే బుచ్చెమ్మ నేస్తురాలు రాంబొట్లుగారి అచ్చమ్మ నోరెళ్ళబెట్టి వింటుంది "ఇవన్నీ నీకెలా తెలుసే-" అంటూ ఆశ్చర్యపోతుంది ఎలా తెలుసేమిటి. గిరీశంగారి సావాసం ఊరికే పోతుందా?- కరటక శాస్త్రులు మాత్రం తక్కువవాడా? సంస్కృత కావ్యాలు ఎన్ని చదివాడని ఇహ పూజారి గవరయ్య కవిత్వం చెప్పటంలో ఎవరికి తీసిపోయాడు కనక?- ఉబుసుపోకకు పేకాడుకుంటుంటే ఆట్టే ఆలోచించకుండానే -" రాణా డైమను రాణీ, రాణా యిస్పేటు రాణి, రాణా కళావర్రాణా ఆటీన్రాణీ, రాణి యన న్మధురవాణె రాజుల రాణీ-"అంటూ ఆశుకవిత్వం అల్లేశాడు. ఇంతమందిని నా చుట్టూ తిప్పుకోగలిగినప్పుడు ఆ పాటి కవిత్వం రహస్యాలు తెలుసుకోలేనూ- అదీకాక ఏటిగట్టు ఇసుకలో వెన్నెల దుప్పటి పరుస్తుంటే, చల్లగాలి మనసుకు గిలిగింతలు పెడుతుంటే ఎవరి ఊహలు మాత్రం కళ్ళెం వదిలిన గుర్రాల్లా పరిగెత్తవూ

విలాసినులు వున్నచోట వెన్నెల మరింత వయ్యారాలు పోతుందంటారు శ్రీపాదవారు "పుచ్చపువ్వులాగ వెన్నెల గందప్పూతలాగ చల్లగాలి వీటి కనుకూలంగానే మానసిక పరిస్థితులు-"అంటూ "వడ్లగింజలు" నవలలో వెన్నెల వర్ణన మొదలుపెట్టిన శ్రీపాదవారు పాఠకులను విలాసినుల వాడలోకి తీసికెళ్తారు "సర్వవిధాల అది విలక్షణ ప్రపంచం మామూలుగా కాక అక్కడి వెన్నెల సురభిళంగా వుంటుంది పిల్లగాలి మదురంగా వుంటుంది" అంటారు వన్నెలాడుల సాహచర్యంలో వెండి వెన్నెల మరింత హాయిగా యింకా చల్లగా పరిమళభరితంగా కూడా వున్నట్లు అనిపించటంలో ఆశ్చర్యమేముంటుంది బంగారానికి తావి అబ్బటం అంటే అదే కదా!

ఈ బావానికే గంగాధర కవి కూడా తన సపోర్టును యిస్తాడు ఆయన తన తపతీ సంవరణ కావ్యంలో -"హావభావ విలాస విఖ్యాత విటుల సతుల వలపించు వైఖరి సంఘటిల్ల" అంటూ ప్రారంభించి -"బూర్ణ రాకా నిశాకరోద్భూత శీతకరము లఖిల జనాహ్లాదకరములయ్యె" అంటూ అమృతమయ స్వరూపుడయిన చంద్రుణ్ణి కళ్ళకు కట్టినట్లు చూపిస్తాడు అయితే నాయకుడు దగ్గర లేక విరహంతో వేగిపోతున్న తపతికి చంద్రుడు నిప్పులు కురిపిస్తున్నట్లే తోస్తాడు "ఓ రజనీశ హాలహల సోదర యీ క్రియ విస్ఫులింగముల్ క్రూరత గుప్పళించెదవు నీకః బాడియే-"అంటూ తిట్టిపోస్తుంది విరహిణులకు వెన్నెల వేడిగా అనిపించటం చంద్ర దూషణ చేయటం మామూలే ప్రియుడు పక్కన వుంటే చలువల రేడుగా ప్రియబాంధవుడుగా కనిపించే చంద్రుడు- సఖుడు సమీపంలో లేకపోతే నిప్పుల బంతిలా పరమశత్రువులా కనిపిస్తాడు అవస్థా భేదాలంటే యివే కాబోలు!

వెన్నెలకందము పున్నమ అన్నారు వెన్నెల మహిమలు వర్ణించటం ఒక విధంగా అలవిమాలిన పనే ఇనుప కచ్చడాల్ కట్టుకున్న ముని ముచ్చులను కూడా వెన్నెల తికమకలు

పెట్టిన సందర్భాలు అనేకం వున్నాయి "గంగా ప్రవాహంబు కాబోలునని వశిష్ఠాదు లను ష్ఠాన మాచరింప, నమృతంపు వెల్లువయని నిలింపాదులు దోసిళ్ళ ముంచి క్రోల దుగ్ధాంబునిధియని తోయజాక్షుడు శేషపర్యంక మిడుకొని పవ్వళింప-" విరగపడి వెన్నెల కాసిందని ఓ కవీశ్వరుడు శీతల కిరణాలను స్తుతించాడు. వెన్నెల వరదను గంగా ప్రవాహం అనుకొని వశిష్ఠాది మహామునులు అనుష్ఠానా లాచరింపటం ప్రారంభిస్తే విష్ణుమూర్తి పాలసముద్రం కాబోలుననుకొని శేషపాన్పు పరుచుకొని శయనించాడుట మహామునులను విష్ణుమూర్తినే భ్రమింప చేసిన శీతకిరణుడు ఎంత గొప్పవాడు అయుండాలి?

"వెన్నెలల వేళనే వేణువూదెనా వేణుపూదిన వేళనె వెన్నెలాయెనా-" అన్న సందేహం రాధకు కలుగుతుంది. వెన్నెలకు వేణుగానానికి మధురభావనా లహరులకు అంత సన్నిహిత సంబంధం వుంది మరి "అచ్చపుం దెలి నిండు వెన్నెలలతో నబ్బారి వచ్చెం, గడున్ హెచ్చెం బచ్చని వింటి జోదు, చలిగా లేతెంచె నిచ్చోట ముచ్చిచ్చుంగూడిన నోర్చునే చెలియ"అంటాడు వసుచరిత్ర కర్త తెల్లని వెన్నెలలు గుమ్మరించుకుంటూ చంద్రుడు వచ్చేశాట్ట ఇదే అదనని మన్మథుడు విజృంభించాట్ట చలిగాలివారితో చెయి కల్పిందిట. రామప్పపంతులు అన్నట్లు ఉప్పులేకనే ముప్పందుంగా విరహంతో వేగిపోతున్న నాయికకు యివన్నీ కూడా తోడయితే యిహ చెప్పాలా- అందుకే బావురుమని ఏడ్చేస్తుంది. వెన్నెలకు మురిపించే శక్తే కాదు మనుషులను ఏడ్పించే సత్తా కూడా వుంది- మరి!

పండు వెన్నెల్లో షికారుకు బయలుదేరిన గోపిక యమునానది వొడ్డుకు వచ్చి అక్కడి అందాలకు ముగ్ధురాలౌతుంది ఏటి ఒడ్డున ఇసుక మీద నెలరాజు తన వెన్నెల కిరణాలతో మల్లెపూల పక్క పరిచినట్లు గారడీ చేయగా -"ఎవరే పరిచే రిసుక బయలుపై మల్లెల శయ్యలు ప్రియా ప్రియా-" అంటూ ఆశ్చర్యపోతుంది అదంతా వెన్నెల మహత్యం అని ఆమెకు తెలియకపోలేదు కాకుంటే కృష్ణశాస్త్రిగారి భావాల్లో మధురమైన ఆయన మాటల్లో మనలను కూడా ముగ్ధుల్ని చేయాలనే వయ్యారం కాకపోతే ఇలాంటి కవుల గీతాలు వెన్నెలంత మృదువుగాను అంతకంటే హాయిగాను వుంటాయి

"రాతిరికి వస్తావని చందమామయ్యో రాతిగంధం తీసినాను చందమామయ్యో, నీవు రాకనే పోతివి చందమామయ్యో రాతిగంధం ఎండిపోయె చందమామయ్యో-"అంటూ ఓ పల్లెపడుచు బాధపడుతుంది. వెంటనే అర్థమయేటట్లు తేలిక మాటలలో చందమామను అడ్డం పెట్టుకొని తన మామతో ఉన్నమాట చెప్పేసి తన హృదయావేదనను వెల్లడి చేస్తుంది యీ పడుచు ఇదే భావం కవులకు కలిగితే కవిత్వం కాస్త ముదురుపాకాన పడుతుంది. దాదాపు ఇటువంటి భావంతోనే -"హేమ పాత్రల చందన మెండి పోయె ద్వారముల్ మోయుచున్నవి హారములను-"అంటూ సాగుతుందో భావగీతం

దొడ్లో వెన్నెల్లో కూర్చుంటే ఊహలేమిటో యిలా తీగలు సాగుతున్నాయి మా పంతులుగారు కమాను నుంచి వచ్చినట్లున్నాడు"- మధురం మధురం ."అని వీధీ వాడా దద్దరిల్లిపోయేలా తలుపులు బాదుతూ అరుస్తున్నాడు నాకు తెలుసు ఆ అనుమానం మనిషి దొడ్డితలుపు బయటగొళ్ళెం వేసి వీధి తలుపు బాదుతాడని. అలాగే చేశాడు "ఏమి బెహద్బీ-" అనుకుంటూ వెళ్ళి తలుపు తీస్తే -"ఇంతసేపు ఏం చేస్తున్నావు ఎవరున్నారు దొడ్లో-"అన్నాడు అనుమానం పంతులు "ఏం చేస్తున్నానా. వెన్నెల స్నానం చేస్తున్నాను. ఎవరున్నారా. ఆకాశంలో చందమామ వున్నాడు. దొడ్లో వెన్నెలుంది-" అంటూ విరగబడి నవ్వాను నా మాటలు అర్థం కాక పంతులు వెర్రిమొహం పెట్టాడు! ★

గత సంచిక తరువాయి భాగము

# కార్య కారణత : జ్ఞానం – సత్యం – 2

- రావిపూడి వెంకటాద్రి
(హేతువాది సంపాదకుడు)

## అయితే స్ఫోటకంలోని వాస్తవ కార్యకారణ సంబంధా లేమిటి?

స్ఫోటకం రావడమనేది కార్యం. అది అంటువ్యాధి. వైరస్ అనే ఒక విధమైన సూక్ష్మజాతి సూక్ష్మజీవులు శరీరానికిసోకి వ్యాపించడంవల్ల శరీరం మీద కురుపులు లేస్తాయి. జ్వరం వస్తుంది. రోగి చాలా బాధకు లోనవుతాడు. చాలా సందర్భాల్లో మరణిస్తాడు మరణాన్ని తప్పించుకున్నా, వికార రూపాన్ని తప్పించుకోలేడు. కాని స్ఫోటకం అంటువ్యాధి అయినా, అందరికీ రాదు. లొంగే శరీరాలనే అది ఆశిస్తుంది. అంటే, కొందరి దేహాలకు మాత్రమే దానికి లొంగే స్వభావం-సస్సెప్టిబిలిటీ (Susceptibility) వుంటుంది. టీకాల (Vaccination) ద్వారా నిరోధక శక్తిని పెంచుకున్న వారిని కూడా స్ఫోటకం వైరస్ ఆశించదు. కాబట్టి, స్ఫోటకం రావడానికి అంతర్గత కారణం రోగి శరీరంలోనే వుంటుంది. ఆకారణాన్ని తొలగిస్తే, స్ఫోటకం వైరస్ మనిషి శరీరాన్ని తాకినా అది ఏమీ చేయలేదు. మనిషి శరీరంలో స్ఫోటకం వైరస్‌కు లొంగే స్వభావం ఉన్నప్పుడే ఆ శరీరాన్ని వైరసు తాకితే స్ఫోటకం వ్యాపిస్తుంది. అంటే ఇక్కడ రోగి స్ఫోటకానికి గురికావడానికి వైరసు బాహ్యకారణంగా పనిచేసింది. లోకం దృష్టిలో ఏ కారణానికి ఎంత ప్రాముఖ్యత వుందో మనకు తెలుసు. అంతర్గత కారణాన్ని కనుగొన్న ఆధునిక విజ్ఞానశాస్త్రం టీకాల కార్యక్రమం చేపట్టి స్ఫోటకం వైరసును నిరోధించే శక్తిని మనుషుల శరీరాల్లో ప్రవేశపెట్టింది. ఈ నాడు బహుశః నూటికి నూరుపాళ్లు స్ఫోటకం నిర్మూలించబడిందనే చెప్పవచ్చు.

ఇలా అన్ని సందర్భాల్లోనూ అంతర్గత కారణాలను, బాహ్యకారణాలను ( నిజానికి బాహ్య అంశాలు), వాస్తవ కారణాలను, తప్పుడు కారణాలను విశ్లేషించుకోవచ్చు. అర్థం చేసుకోవచ్చు. వివేకంతో అచరణలో ప్రయోగించుకోవచ్చు. అంతేకాని, మాటల అర్థాల కోసం కుస్తీలు పట్టడం అందరికీ అర్థమయ్యే మాటలకూ (కార్యకారణాలకు) నిర్వచనాలు చెప్పమని నిలదీయడం - వాస్తవికతకు మసిపూసే మాటల్లో కా''రణాలను'' కనిపెట్టడం జీవుళ్ళు, దేవుళ్లు అంటూ భ్రమల్ని ప్రమాణాలుగా ప్రదర్శనకు పెట్టడం, ప్రమాణాలు, ప్రమేయాల పేరుతో తార్కిక గుడుగుడు గుంచం ఆడుతూ అవాస్తవిక ఊహా లోకంలో తేలియాడడం ఇవన్నీ ఆధునిక శాస్త్రీయ పద్ధతికీ, తాత్విక ధోరణికీ పనికిరాని అంశాలు. అయినా, అలాంటి వాటినే పట్టుకొని ఊగులాడే వారు ఈ నాటికిన్నీ వున్నారు.

## కార్య కారణ వ్యర్థ చర్చ

ఆధునిక విజ్ఞాన శాస్త్ర సంపద అందని రోజుల్లో మత పూర్వులు తార్కిక దృక్పథంతో కార్యకారణాల అంతు తేల్చుకోడానికి చాలా చర్చ చేశారు. వారంతా తలకొక మార్గానికి చేరారు. అందులో చాలా వాదాలు మతాలుగానో, మత శాఖలుగానో కుదురుకొన్నాయి. చారిత్రక ఆసక్తితో తప్ప, ఈ నాడు ఆ వాదాలను కొత్తగా రేపే అవసరం మనకు లేదు ప్రకృతి పరిణామం తీరు వారికి సక్రమంగా అవగాహన కానందువల్ల వారి కార్య కారణాల చర్చ సైతం నేల విడిచిన సాముైంది:

''కారణం నశించి కార్యం వచ్చిందా? కారణం అలానే వుండి కార్యం వచ్చిందా? కారణంలో అవ్యక్తంగా వున్న కార్యమే వ్యక్తమైందా? లేనిది రాదు, వున్నది పోదు కాన వస్తున్నట్లూ, పోతున్నట్లూ మనకు కల్పిస్తున్నదంతా భ్రమా? అంతా కారణ బ్రహ్మ తప్ప అన్యం వుందా?'' ఇలాంటి ప్రశ్నలన్నిటికీ ఈ నాడు అర్థం పోయింది. ఇక్కడ కూడా ఆధునిక విజ్ఞానంలోని ద్రవ్య నిత్యత్వ సూత్రాన్ని (Law of Conservation of mass and energy) అడ్డం పెట్టకుని కొందరు ప్రబుద్ధులు వింత వాదనలు చేస్తున్నారు. లేనిది రాదు - అంటే, లేని సత్తా రాదని అర్థం. కాని, ఉనికి నిత్య పరిణతిలో వుంది. మారుతున్నది అంటే ఒక వస్తువు మరొక వస్తువుగా రూపొందుతున్నదని అర్థం. వస్తువు మారుతున్నదంటే పాత ధర్మాలు పోయి కొత్త ధర్మాలు వస్తున్నాయని అర్థం. ధర్మాలు మారడం వల్లనే వస్తువులు కూడా మారాయని మనం గుర్తిస్తున్నాం. ధర్మాలనేవి ఆ యా వస్తువులకు, వస్తు సమ్మేళనాలకు చెందినవి. దాని భావం సమ్మేళనంలోని ధర్మాలు అందులో పాల్గొనే మూల ద్రవ్యాలలో గుప్తంగా వున్నాయని కాదు. సోడియమూ, క్లోరినూ కలిసి సోడియం క్లోరైడు అవుతున్నదంటే, సోడియంలోను, క్లోరినులోను కొన్ని ధర్మాలు గుప్తంగా వుండి సోడియం క్లోరైడులో అవివ్యక్తమైనాయని రుజువు చేయలేము. అలానే నీటిలో వ్యక్తమైన తేమ అనే లక్షణం అంతకు ముందే దాని మూల ద్రవ్యాలైన హైడ్రోజను ఆక్సిజనుల్లో వున్నదని రుజువుచేయలేం. ధర్మాలు పదార్థ సంఘటన (Composition)కి చెందుతాయని గుర్తించకపోతే అలాంటి విపరీత ఆలోచనలు వస్తాయి. ఇలాంటి ఆలోచనలే భూత వాదానికి (animism) కూడా దారితీసి రాళ్ళకూ రప్పలకూ కూడా ప్రాణం వున్నదని వాదించే దాకా కొందరు పారబడ్డారు. ప్రాణం ఒకానొక విధంగా సంఘటన అయిన పదార్థం ప్రకటించే లక్షణమే కాని అన్యం కాదు అది జీవుడూ కాదు, ఆత్మా కాదు. ఆ సంఘటన విచ్ఛిన్నమైనపుడు ఆ ధర్మం అంతర్ధాన మవుతుంది. ప్రకృతి పరిణామ రీతిని అర్థం చేసుకోజాలని వారే యిలాంటి వికృత అన్వయాలు సాధించడానికి పాల్పడతారు. నిజానికి ద్రవ్య నిత్యత్వ సూత్ర భావమేమిటంటే ఎలాంటి స్థితిలోనూ, పరిణామంలో ద్రవ్యం నాశనమూ కాదు, కొత్తగా ఉత్పన్నం కానూ కాదు అని. పరిణామంలో కొత్త లక్షణాలు రావనే అర్థం అందులో లేదు అంతేకాదు, లక్షణాలు మారకుంటే, పాత లక్షణాలే వుంటే ఒక వస్తువు మరో వస్తువుగా పరిణామం చెందలేదని అర్థం అంటే, భూత వాదులు పరిణామాన్ని అంగీకరించరని తేలుతుంది.

అంతేకాదు, ''పత్తికి మట్టి కారణమా? మట్టికి పత్తి కారణమా? పత్తికి బట్ట కారణమా? బట్టకి పత్తి కారణమా?'' అంటూ రెండు వేల సంవత్సరాల నాటి కార్యకారణ చర్చలో బయలుదేరిన ప్రశ్నల నమూనాలోనే ''సైకిలుకు సైకిలు భాగాలు కారణమా, సైకిలు భాగాలకు సైకిలు కారణమా?'' అనే ప్రశ్న బయలు దేరింది. అలౌకికానికి దారితీయాలనే వుద్దేశంతో వేసే యిలాంటి లౌకిక ప్రశ్నలకు సమాధానాల కోసం తాత్విక పరిధుల్ని తాకనవసరం లేదు. కేవలం సామాన్యుని ఇంగిత జ్ఞానమే వాటికి సమాధానాలు చెపుతుంది. ప్రశ్న ప్రశ్న కోసం కాదు. సమాధానం కోసం వేయాలి. వివాదం కోసం కాదు, వివరణ కోసం వేయాలి.

సత్యం వాస్తవిక జగత్తుకు సంబంధించినది. జగత్తును గురించిన మన జ్ఞానం పెరిగే కొలది సత్యం వికసిస్తుంది. అది వికసించే కొలది దానికి అనుగుణంగా మన తాత్విక అవగాహన పరిధి పెరుగుతుంది. ఈ మార్పును గుర్తించనివారు వెనక్కు వెనక్కు నడుస్తారు.

మన బుద్ధి మనవద్ద లేకపోతే, అంటే, మనం వైమనస్యత (alienation)కు గురయితే పుక్కిటి పురాణ గాథలు ఖూడా కమ్మగా, ఆనంద దాయకంగా వుంటాయి. మంత్రాలు వల్లిస్తూ అర్థాలు

చెపుతుంటే అవీ వినబుద్ధి అవుతూనే వుంటాయి అయితే, ఈ నాటి విశ్వ విజ్ఞానం మంత్రాల దశను దాటి యుగాలు ముందుకు నడిచింది ప్రపంచ జ్ఞానం లేని బ్రహ్మజ్ఞానాన్ని ఆమోదించే దశలో మనము లేము బృహదారణ్యకోపనిషత్తులో బ్రహ్మ జ్ఞాని యాజ్ఞవల్క్యుడు ఆకాశంలో సూర్యుడి పైన చంద్రుణ్ణి, ఆ పైన నక్షత్రాల్ని, ఆ పైన దేవ-ఇంద్ర-బ్రహ్మ లోకాల్ని వుంచాడు (3-6-1). అందులోని ''అసతోమా సద్గమయ''తో మనం మురిసిపోనవసరం లేదు. అందులో ఆది నుంచి తుదిదాక ప్రకృతిని గురించి, పరిణామం గురించి, జంతు జాలం గురించి, అనేకానేక యితర విషయాల గురించి వున్నదంతా అపభ్రంశ జ్ఞానమే అక్కడ నుంచి మనం సత్యాన్వేషణ ప్రారంభిస్తే, మరోసారి మనం ఆటవిక దశకు చేరతాం.

అందుకే హేతు వాదులు అలాంటి వాటిని సమూలంగా తిరస్కరిస్తారు

ఆధునిక విజ్ఞానాన్ని ఆధారం చేసుకొని కార్యకారణ భావాన్ని వీలైనంత సమగ్రంగా అవగాహన చేసుకొని జీవితానికి అన్వయించుకొంటారు ఇతరులు కూడా వారిని అర్థం చేసుకొని, వారి పద్ధతిని అనుసరించాలని ఆశిస్తారు.

అనాది నుంచీ మనిషి సత్యాన్వేషణ చేస్తూనే వచ్చాడు. ఇప్పటికీ చేస్తున్నాడు. అందుకు హేతువాద పద్ధతినే అనుసరించాడు. శాస్త్రీయ పద్ధతి అనేది హేతువాద పద్ధతే. అయితే ఆధునిక శాస్త్రీయ పద్ధతి, కార్యకారణ పద్ధతి అనేవి అనాది తార్కిక పద్ధతిలాగా పిప్పిని నెమరువేస్తూ కూర్చోవడం లేదు. ఈ తేడా అర్థమైతే తప్ప, ఆధునిక తాత్విక దృక్పధానికి చేరువ కాలేము.

సైన్సును అర్థం చేసుకోకుండా మూలాల ప్రశ్నల్ని అర్థం చేసుకోనే మార్గం లేదు. ఇక సమాధానాలెలా అర్థమవుతాయి? అందుకే ప్రశ్నించడానికి కూడా వివేకం కావాలంటాం.

## ON INDIRA GANDHI

Well, my dear friend, you overlook some simple facts of human psychology, if you pardon my saying so. Take it from me, Indira Gandhi will never, repeat never, get over her complex - a very complex complex indeed, consisting of elements such as a feeling of inferiority, sense of insecurity, and an admission of inadequacy inside, à nagging awareness of depthlessness coupled, above all, with the consuming ambition to attain immortal fame eclipsing her great father... And much more, of course. And given the fact that she is a woman, the enigma deepens infinitely. Mark my words, brother, Indira Gandhi has come to stay. Make no mistake, she will be the country's topic number one for a long time to come. The country has to learn to live with her, rather under her, for better or for worse.

**Sri P.V. Narasimha Rao**
*Prime Minister of India.*

# కర్ణుని స్వగతం

# మహాభారతంనాటికే

- నేనవరిని. నాకు జన్మ నిచ్చిన
- నన్ను పెంచి పెద్ద చేసిన
- విద్యకంటే, కులమే
- మానవత్వం
- వీరు

ఒక వ్యక్తి తన తల్లిదండ్రులు, కులము తెలియని స్థితిలో ఒక విధమైన మనోవేదనకు గురైనవాడు దానినే (Identity crisis) అంటారు. అలాంటి బాధనే కర్ణుడు ఎదుర్కోవలసి వచ్చింది. ఈ స్థితిని విజయవంతంగా పూర్తిచేసినవారు తమరంగంలో అఖండ విజయాలను సాధిస్తారు. ముఖ్యంగా నేటి యువత దీనిని ఎక్కువగా ఎదుర్కొంటోంది. ఇది నాటి కర్ణునికీ, విదురునికీ గూడా తప్పలేదు. అసలు ఈ సంకటస్థితి అనేది ''తానెవరు?'' ''తానేమిటి?'' అనే ప్రశ్నలకు స్పష్టమైన సమాధానం కనుగొనడంలో ఉంది. అందుకే ''ఆత్మానం విద్ధి'' "Know thyself" నిన్ను నీవు తెలుసుకోవడంలో మోక్షం ఉంది. ఈ ప్రశ్నకు సమాధానం పూర్తిగా సంతృప్తిగా చెప్పుకో గలిగినవారు ఎవరూ లేరనే చెప్పవచ్చు. పసిబిడ్డలు మొదట మాటలు నేర్చుకొనేటప్పుడు అమ్మ, అత్త, తాతలతో ప్రారంభిస్తారు. ఆ పదాల వెనుక ఉన్న అర్థం కొంచెం కొంచెంగానైనా అర్థమయ్యేది ఇక్కడే. తరవాత మరికొన్ని పదాలు నేర్చుకొన్నా, ఈ కోవలో చివరగా పిల్లవాడు నేర్చుకొనేది 'నేను' అనే పదం. ఈ పదం భావన నాలుగేళ్ళు వచ్చేసరికి గాని సరిగా ఉపయోగించి అర్థం చేసుకోలేడు. 'నీచే' అనే దార్శనికుడు తన కొడుకు ప్రథమంగా ''నేను'' అనే పదాన్ని ఉపయోగించిననాడు పెద్దవిందు ఏర్పాటుచేస్తానని, అలాగే చేశాడట. ''నేను'' భావనతోపాటు ''నీవు'' భావనగూడ ఏర్పడుతుంది. క్రమంగా ''నేను'', ''నన్ను'' ''నాది'' పాదుకొంటాయి. కాని ఈ పదాల వెనుక అర్థం అప్పటికి ఎప్పటికి పూర్తిగా బోధపడదు. 'నేను' పదం ఏ రెండు క్షణాలలోను ఒకటిగా ఉండదు, అది గతి శీలమైంది. 'నేను' భావన విస్తృతమయ్యేకొలది, నేను, నా తండ్రి, నా తల్లి, స్నేహితుడు, నా వస్తువులు, నా నుంచి ఇతరులు ఫలాన ఫలానావి ఆశిస్తున్నారు,

రచన : ప్రొ. శ్రీమతి ఇరావతీ కర్వే
భావ పరిశీలన : రవీంద్రనాథ్

# కుల గజ్జి వుందా

## తల్లిదండ్రు లెవరు ?

## వారికి ఋణపడలేదా ?

## ప్రధానమా ?

## ముందా కులం ముందా ?

## మానవు లెప్పుడవుతారు ?

వారి ఆశలను నేను దృష్టిలో ఉంచుకోవాలి లాటి కొలతలు ఏర్పడుతాయి అసలు 'నేను' భావన ముఖ్యంగా సామాజిక సంబంధాలనుంచి నిష్పన్నమవుతుంది 'నేను' అంటే ఎవరు? ''నేను అనుకొంటున్న నేను 'నేను' కాదు. నీవు అనుకొంటున్న 'నేనూ,' 'నేను' కాదు నన్ను గురించి నీ వేమనుకొంటున్నావని నేననుకొంటున్నానో అదే ''నేను''. (Iam not what I think I am, not what you think I am, I am what I think you think I am) ఈ విధంగా సామాజిక సంబంధాలనుంచి ఏర్పడినను 'నేను' - 'కొడుకు'గా, భర్తగా, తండ్రిగా, స్నేహితునిగా, క్లబ్ సభ్యునిగా, వృత్తి చేసేవానిగా ఎన్నో పాత్రలు నిర్వహిస్తుంది. ఈ పాత్రలు 'నేను' తాదాత్మ్యతను (Identity) ని నిర్ణయిస్తాయి. సామాజిక ప్రవర్తన, సమాజంలో అతని స్థాయి అతనికి విహితమైన కర్మకాండని అతడు ఏమిటో, ఎవరో నిర్ణయిస్తాయి. ఈ విషయాల్లో ఒడుదుడుకులు ఏర్పడిన వారు తాదాత్మ్యతా సంకట స్థితిని తప్పించుకోలేరు.

### కులగజ్జి :

కర్ణుడు, విదురుడు ముఖ్యంగా ఈ స్థితినుంచి బయట పడలేక పోవడానికి కారణం, సమాజంలో వారికి ఇవ్వబడిన స్థానం. జన్మ సమాజంలో మన స్థానాన్ని, స్థాయిని నిర్ణయిస్తుంది. అలాగే వారి జన్మ వారి స్థానాన్ని అపరివర్తనీయంగా ఒక్కమాటే నిర్ణయించివేసింది. విదురుడు సూత స్త్రీకి జన్మించాడు. అతనికి తద్విహితమైన జాతక కర్మలే నిర్వహించబడ్డాయి.

ధృతరాష్ట్రుడు అతనిని తన సోదరుడని ప్రక్కన కూర్చోబెట్టుకొన్నా, అతనికి ఎవరూ క్షత్రియ కన్యను అర్ధాంగిగా ఇవ్వలేదు క్షత్రియులకు దక్కే గౌరవం అతనికి దక్కలేదు.

కర్ణుడూ ఇదే విషవలయంలో పడ్డాడు. సమాజంలో అతనికి ఒక స్థిరమైన స్థానం దక్కలేదు. అతనికి న్యాయంగా రావలసిన స్థాన మేదో అతనికి తెలుసు. దానికోసమే అతడు జీవితాంతం ఆ ంచాడు, పోరాడాడు. దానిని పొందలేక పోవడంలోనే అతని బాధంతా ఉంది

రాధ, అధిరథులు కర్ణుని ప్రేమగానే పెంచినా, వారెప్పుడూ అతడు తమకు దొరికిన విధానాన్ని అతనిని నుంచి దాచలేదు. అత డొక బంగారు పేటికలో క్షత్రియోచితమైన తను త్రాణంతో, కర్ణకుండలాలతో దొరికాడని వారు అతనికి చెప్పారు. వారు అతనికి వసుసేనుడని క్షత్రియ నామమే పెట్టారు. కనుక అతడు సూతుల ఇంట పెరిగినా, అతనికి తన వర్ణ మేదో తెలుసు. పెంపుడు తల్లిదండ్రులను అతడు బాగా ప్రేమించినా ఏ నాటికైనా తన అసలు తల్లిదండ్రులు తనను అంగీకరించి క్షత్రియునిగా ప్రకటించకపోతారా అనే ఆశతోనే పెరిగాడు సూతుడుగానే మిగిలిపోవడం అతనికి ఏ మాత్రం ఇష్టం లేదు ఇదీ అతని జీవన ఘర్షణ తాదాత్మ్యతా సంకట

సూతుడుగా అతడు ఆయుధ విద్యకు అనర్హుడు అందుకనే బ్రాహ్మణుడుగామారువేషంలో గురువు దగ్గర విలువిద్య నేర్చుకొని, యాదృచ్ఛికంగా విషయం బయటపడి, ''నేర్చుకొన్నదంతా మరచి పోదువుగాక,'' అని శపింప బడ్డాడు. ఈ కథ ప్రక్షిప్తంగా కనపడుతోంది ఎందుకంటే అతని గురువని చెప్పబడిన పరశురాముడు కర్ణునికన్నా ఎన్నో శతాబ్దాలు ముందువాడు దీనినిబట్టి మనకు తెలిసేది ఏమంటే, నాడు యుద్ధ విద్యలకు బ్రాహ్మణ క్షత్రియులు మాత్రమే అర్హులనీ, ఇలాంటి నియమం ఉన్నా కూడా కర్ణుడు ఎలాగో యుద్ధ విద్యల్లో ప్రావీణ్యత సంపాదించాడనీ

తన యుద్ధ విద్యా కౌశలాన్ని ప్రదర్శించబోయి ఒకసారి కర్ణుడు భంగపడ్డాడు. ద్రోణుని దగ్గర కౌరవ, పాండవులు విద్యాభ్యాసం పూర్తి చేశారు. ఆయన వారి ప్రావీణ్యతా ప్రదర్శనను రాజాస్థానంలో ఏర్పాటు చేశాడు. ధృత రాష్ట్రుడు, గాంధారి, కుంతి, విదురుడు, భీష్ముడు ఆ ప్రదర్శనను తిలకించడానికి విచ్చేశారు. అర్జునుడు ధనుర్విద్యలో అందరిని తలదన్ని అందరి మెప్పు పొందాడు ఆ సమయంలో చిన్న కలకలం రేగింది ప్రవేశమార్గం వద్ద బలిష్ఠుడైన యువకుడొకడు ప్రవేశించి ''అర్జునుడు చేసిన దంతా నేనూ చేయగలను'' అని చెప్పి, ప్రదర్శనకు పూనుకొన్నాడు. తన కౌశలాన్నంతా ప్రదర్శించిన తరవాత అర్జునుణ్ణి ద్వంద్వ యుద్ధానికి సవాలు విసిరాడు. ఈ యువకుడే కర్ణుడు అంత వరకు ఇత డెవరో రాజాస్థానంలో ఎవరికీ తెలియదు. ఈ సంఘటన చిన్నదే అయినా, బహు నాటకీయంగా జరిగింది. తరువాత జరగబోయే భారత కథకు మంచి పట్టునిచ్చింది. నూతన అర్థాన్ని కలిపించింది.

ద్రోణుడు అసలు తన శిష్యుల ప్రదర్శనను ఏర్పాటు చేశాడు బయటవారినెవరినీ ఆహ్వానించ లేదు అధిరథునికీ తెలియదు తన యుద్ధ విద్యా కౌశలం చూసిన తరవాత, తన క్షత్రియ మాతాపితలు తనను పుత్రునిగా అంగీకరించవచ్చుననే ఆశతోనే కర్ణుడు రంగ ప్రవేశం చేశాడు. ఇదే అతని ఉద్దేశం అయితే, విద్యాప్రదర్శన చేసి ఊరుకొంటే సరిపోయేది అర్జునుణ్ణి ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించవలసిన పనిలేదు.

ఈ సంఘటన మరో ప్రశ్నను లేవనెత్తుతుంది. అది వారి వయస్సుల ప్రశ్న. ఈ సంఘటనా సమయంలో ధర్మజునికి పదహారు సంవత్సరాలున్నా యనుకొంటే, అర్జునికి పదునాలుగు సంవత్సరాల కన్నా ఎక్కువ ఉండే వీలులేదు. ఎందుకంటే ఇద్దరి మధ్యలో భీముడు ఉన్నాడు గదా. ఒకవేళ ధర్మరాజుకు పద్దెనిమిది సంవత్సరాలనుకొంటే, అర్జునిడికి పదహారు. కర్ణుడు కుంతికి వివాహానికి ముందు పుట్టాడు గనుక, అర్జునునికంటె నాలుగేళ్లు పెద్దవాడవుతాడు. అంటే అతడు బాల్యాన్ని దాటి వయోజనులు (adult) అవుతాడు. ఈ విధంగా చూస్తే ఒక వయోజనుడు ఒక బాలుని సవాలు చేయడం ఏమి సబబు? కర్ణుడు ఎప్పుడూ కోపంలో ఇలాంటి అనుచితమైన పనులనే చేస్తాడు. తొందరపాటును ప్రదర్శిస్తాడు. వేగిరపాటు క్షత్రియ శీల లక్షణమే అయినా సంకుచిత మనస్కుడుగా ఉండకూడదు. దీనిని కర్ణుడు ఉల్లంఘించాడు.

తానొక క్షత్రియుని అక్రమ సంతానమనే బాధ అతనిని పట్టి పీడిస్తోంది. కొన్ని పరిస్థితులలో అటువంటి అక్రమ సంతానాన్ని క్రమ సంతానంగా గుర్తించవచ్చుగాని, ఈ కర్ణుని విషయంలో అది కుదురలేదు. అతడు సూత వర్గం తరపున కాని, యుద్ధ కౌశలం ఉన్న ప్రతి ఒక్కరిని క్షత్రియునిగా గుర్తించాలనే సిద్ధాంతం కోసం కాని పోట్లాడడం లేదు. అది వర్గ పోరాటం కాదు. తన స్వంతం కోసం పెనుగులాడుతున్నాడు. ప్రదర్శన క్షేత్రంలో గుర్తింపూ పొందలేక పోయాడు. అతని జన్మ రహస్యమూ రహస్యంగానే మిగిలిపోయింది ఫలితంగా కుపితుడైపోయాడు.

కర్ణుడు సవాలు విసరినప్పుడు అక్కడ ఉన్న క్షత్రియ జనం రెండు వర్గాలుగా చీలిపోయింది. ధర్మరాజు, అతని సోదరులు, భీష్ముడు అర్జునుని వైపు నిలబడ్డారు. దుర్యోధనాదులు కర్ణుని కోపు కాశారు. యుద్ధనీతి తెలిసిన కృపాచార్యుడు ఇలా ప్రకటించాడు:

''ఇదిగో, పాండునందనుడు అర్జునుడు సవాలును అంగీకరిస్తున్నాడు. ఓ అజ్ఞాత అభియోక్తు! మీ రెవరు? మీ కులమేది?''

కర్ణుడు కన్నుల నిండ నీరు నిండగా మూగవోయాడు. అప్పుడు దుర్యోధనుడు కల్పించుకొని, ''యుద్ధవీరుడు కులగోత్రాలు ప్రకటించ పనిలేదు అర్జునునికి రాజు కాని వానితో పోరాడడం ఇష్టం లేకపోతే, అతనిని నేను ఇదే రాజును చేస్తున్నా''నని అంగరాజ్యానికి రాజును చేశాడు (ఇదంతా కూడ తరువాత కలిపిన కథగా కనిపిస్తున్నది. ఎలాగంటే - దుర్యోధనుడు ఆ సమయంలో రాకుమారుడే కాని రాజు కాదు. అతడి తండ్రి సింహాసనాన్ని అధిష్ఠించగా, భీష్ముడు రాజ్యాన్ని పాలిస్తున్నాడు. తరువాతి ప్రకరణంలో ధర్మరాజు రాజవుతాడనేది స్పష్టం చేయబడింది. ఈ పరిస్థితులలో దుర్యోధనుడు కర్ణునికి రాజ్యాన్ని ఎలా ఇస్తాడు? అందుకని కర్ణ అంగరాజ్యాభిషేకం అసంభవం). కర్ణుడు ఎక్కడకు వెళ్ళింది తెలిసికొన్న అధిరథుడు బిరబిర పరుగెత్తుకొచ్చాడు. అతనిని చూచిన కర్ణుడు ఎదురేగి, 'తండ్రీ' అని సంబోధించాడు. అధిరథుడు అతనిని కౌగలించుకొన్నాడు. దీనితో కృపాచార్యుని సందేహం తీరింది. ఈ విధంగా క్షత్రియత్వం పొందాలనే అతని ఆస అడియాస అయింది. సూతుడనే విషయం బహిరంగమైంది. పుండు మీద కారం చల్లినట్లుగా భీముడు, ''నీవు నీ వృత్తికి అనుగుణంగా కత్తికాక చర్నాకోల పట్టవలసినవాడవు. అలాగే ఉండు'' అన్నాడు. అప్పుడు దుర్యోధనుడు కర్ణుని కౌగిలించుకొని తన స్నేహ హస్తాన్ని అందించాడు. అప్పటికే సూర్యాస్తమయమైంది. తగవు, ప్రదర్శన అలా ముగిశాయి.

తనను సతతం వేధిస్తున్న ''తానెవరు?'' అనే ప్రశ్నకు సమాధానం చిక్కకపోగా, కర్ణుడు మరింత అయోమయంలో పడిపోయాడు. అప్పుడు కాకపోయినా, తరువాత ఎప్పుడో కర్ణుడు అంగరాజయ్యాడు. దుర్యోధనుని కొలువులో నిలిచిపోయాడు. అతనికి హితుడు, స్నేహితుడు అయ్యాడు. కాని ఇది ఏమాత్రం అతని సామాజిక అంతస్తును పెంచలేకపోయింది. క్షత్రియునితో సమానం కాలేకపోయాడు. దుర్యోధనుడు కూడ తన కుటుంబం నుంచి ఒక క్షత్రియ కన్యను కర్ణునికి కట్టబెట్టలేదు (ఉద్యోగ పర్వంలో కర్ణుడు చెప్పినట్లు, తానేకాదు తన పుత్రులు గూడ సూత కులంలోనే వివాహమాడారు). కర్ణుడు దుర్యోధనుని అంటిపెట్టుకొని ఉన్నది వాత్సల్యంతో కాదు, విశ్వాసపరంగానే. తన హీనకులం బహిరంగంగా ధ్రువీకరించబడిన కొలదీ, తన క్షత్రియ మూలం లోలోపల తన మనస్సులో నాటుకు పోసాగింది. దీనితో అతని మనోవ్యథ మరింత ప్రబలమైంది.

పాండవులతో తనకేవిధంగాను సంబంధం ఉందని అతనికి తెలియదు. మరి పాండవులను ఎందుకు ద్వేషించినట్లు? బహుశా ఈ దిగువ కారణాలు కావచ్చు: మనం ఇంతకు ముందు చెప్పుకొన్నట్లు, భీముడు కావాలనే పుండు మీద కారం చల్లాడు. అర్జునుని విలుకానితనంపై అతనికి అసూయ ఉంది. పాండవ శత్రువైన దుర్యోధనుని స్నేహం మరోకారణం. దురదృష్టం ఏమిటంటే, ఈ మొదటి సమావేశంలోనే అతని న్యూనత బయటపడింది. దానితో అతనిలో అసూయా ద్వేషాలు పెరిగాయి. ఆ తరువాత గూడా ఎప్పుడూ కర్ణార్జున సమాఘాతంలో అర్జునుడిదే పైచేయి అయింది తప్ప, కర్ణుడు గెలిచింది లేదు.

ద్రౌపదీ స్వయంవరంలో మత్స్య యంత్రాన్ని ఛేదించినవాడు అర్జునుడే. (కర్ణుడూ ప్రయత్నించాడనీ, అతడు హీన కులజుడు కాన ద్రౌపది ఒప్పుకోలేదనీ పాఠాంతరం). అతడప్పుడు బ్రాహ్మణ వేషంలో ఉన్నాడు. ఒక క్షత్రియ కన్యను బ్రాహ్మణుడు గెలవడమేమిటని క్షత్రియులంతా అర్జునునిపై బడ్డారు. అప్పుడు భీమార్జునులు ఒక ప్రక్క, కర్ణునితో సహా క్షత్రియులంతా రెండో ప్రక్క. భీమార్జునులు క్షత్రియ వాహినినంతా నిర్జించారు. కొంతసేపు యుద్ధం జరిగిన తరువాత కర్ణుడు తాను బ్రాహ్మణులతో తలపడనని చెప్పి యుద్ధం నుంచి నిష్క్రమించినట్లు తెలుస్తుంది. యుద్ధంలో దెబ్బతిన్న అతడు అవమానం నుంచి బయట పడడానికి పన్నిన కుంటిసాకుగా అది కనిపిస్తున్నది.

ద్యూత సంఘటన అందరిని పరీక్షకు గురిచేసింది. అంధుడైన ధృతరాష్ట్రుడు ''ఏమి జరుగుతోంది? ఏమి జరుగుతోం''దని ప్రశ్నిస్తున్నాడు. దుశ్శాసనుడు సంతోషంతో ఎగిరి గంతులు వేస్తున్నాడు. విదురుడు ద్రౌపది గౌరవ రక్షణకు యత్నిస్తున్నాడు. బాహిరకుడైన కర్ణుడూ ఈ కుటుంబం తగవులో పాలుపంచుకున్నాడు. అత్యంతంగా అందరికంటే హీనుడనని ఋజువు చేసుకొన్నాడు. ధర్మజుడు ద్యూతంలో ఓడి తనను, తమ్ములను, భార్యను ఒడ్డి ఓడిపోయాడు. ద్రౌపదిని రాజసభకు బరబరా ఈడ్చుకు వచ్చారు. ''తనను కోల్పోయిన నన్ను కోల్పోయాడా ? నన్ను కోల్పోయి తనను కోల్పోయాడా?'' - అనే ద్రౌపది ప్రశ్నకు సమాధానం సభ నుంచి రాలేదు. ఒక్క వికర్ణుడు (దుర్యోధనుని తమ్ముడు) మాత్రం ఒక కులీన మహిళకు ఇలాంటి అవమానం జరుగరాదని వాదించాడు. అప్పుడు కర్ణుడు లేచి వికర్ణునికి అడ్డు తగిలాడు: ''పంచ భర్తృక లంజకంటే గొప్పది కాదు. అటువంటి లంజను సభకు ఈడ్చుకు రావడంలో

దోషం ఏమీలేదు. అదీ, దాని భర్తలూ - అందరూ దాసజనమే. వాళ్ళ ఒంటిమీది బట్టలు గూడ వారివి కావు ''వారి ఒంటిపై ఆభరణాలను తొలగించండి.'' ఇది వినగానే పాండవులు తమ పై ఉత్తరీయాలను తామే తొలగించారు. అప్పుడు దుశ్శాసనుడు ద్రౌపది వస్త్రాపహరణం ప్రారంభించాడు. ద్రౌపదిని అంతగా వస్త్రాపహరణం చేసి అవమానించడానికి కారణం కర్ణుని ప్రోద్బలమే. కర్ణుడు ఈ మాటలు పలుకక ముందు ద్రౌపది వస్త్రాలు తీసివేయాలనే ఆలోచనే ఎవరికీ రాలేదు. కౌరవ పాండవులు తగవు పడింది రాజ్యంకోసం. దానిని యుద్ధం ద్వారానో పాచికల ద్వారానో పరిష్కరించుకోవచ్చు. అది వారి ఇష్టం. కాని ఈ విధంగా ఒక భద్ర మహిళను అవమానపరిచే కుసంస్కారానికి కర్ణుడే మూలం ఇందులో కర్ణుని హీన, అహీన కులానికి ఏమీ సంబంధం లేదు. అసలు ఏ పరిస్థితులలోనైనా ఒక ఉన్నత కుల సంజాతను అవమానం చేయవచ్చా? అనేది మౌలిక ప్రశ్న. అసలు దాయాదుల మధ్య తగవులో తాను తల దూర్చవలసిన అవసరం కర్ణుడికి ఏముంది? పాల్గొన్నాడు. పాల్గొని తన అంతర్గత ఒత్తిడి క్రింద మానవతా విలువలనే మరచిపోయాడు.

ఘోష యాత్రలో గూడ కర్ణుని అవగుణం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఒక యుద్ధ వీరుడుగా పాటించవలసిన ధర్మాన్ని పాటించలేకపోయాడు. దుర్యోధనుడు సపరివారంగా అంగరంగ వైభవంతో తమ పటాటోపాన్ని, వైభవాన్ని పాండవులకు ప్రదర్శించడానికి ఘోషయాత్ర నెపాన పాండవులున్న అరణ్యప్రాంతానికి వెళతాడు. దుశ్శాసనుడూ, కర్ణుడూ గూడా తోడు వెళ్తారు. (అప్పుడు పాండవులు అరణ్యంలో ప్రవాసంలో ఉన్నారు). ఈ సమయంలో వనయాత్రకు వచ్చిన గంధర్వులతో దుర్యోధనాదులకు యుద్ధం జరుగుతుంది. కర్ణుడు పారిపోయి ప్రక్క గ్రామంలో తలదాచుకొంటాడు. పాండవులు గంధర్వులను నిర్జించి, బంధితుడైన దుర్యోధనుని విడిపించి, హస్తినకు పంపుతారు. ఈలోపు భీష్ముడు దుర్యోధనుని గంధర్వులు బంధించారని విని యుద్ధానికి బయలు దేరుతాడు. దుర్యోధనుని పాండవులు విడిపించారని మార్గమధ్యంలోనే భీష్మునికి తెలుస్తుంది. అప్పుడు కర్ణుడు భీష్ముని కలిసి, దుర్యోధనుని క్షేమ సమాచారాలడుగుతాడు. భీష్మునికి కోపం వచ్చి, ''రాజుకు విశ్వాసులైన వారెవరూ రాజు ఎలా ఉన్నాడని అడిగేందుకు బ్రతికి ఉండరు. రాజు అపాయకర పరిస్థితులలో ఉంటే, నీ రక్షణ ఎలా చూసుకొన్నావు? రాజుమీద నీకున్న ప్రేమ కపట ప్రేమ'' అని అన్నాడు. ఇప్పటివరకు తాను దుర్యోధనునికి స్నేహితుడననే భ్రమలో ఉన్నాడు. భీష్ముడు పెట్టిన చీవాట్లతో తలవాచిపోయింది. ఈ పరీక్షలోనూ కర్ణుడు ఓడిపోయాడు.

మరో సంఘటన గోగ్రహణం. కౌరవులు విరటుని ఆవులను తోలుకు వచ్చే ఘటన. అప్పుడు అర్జునుడు ఒక్కడే కౌరవులనందరిని తరిమి, వారి దుస్తులను విరటుని కూతురుకు బొమ్మ గుడ్డలుగ బహూకరిస్తాడు. పిరికిపంద అయిన సారథిని పెట్టుకొని అర్జునుడు కౌరవుల నందరిని నిర్జించడమే కాదు; కర్ణునిపై తన ఆధిక్యతను రుజువు చేసుకొన్నాడు. ఇక్కడా కర్ణుడు అర్జునునికి దీటు కాలేదు.

కర్ణుడు సూర్యసుతు డని చెబుతారు. ఆ సంగతి తెలియకుండానే అతడు మొదటి నుంచి సూర్యుణ్ణే పూజిస్తాడు. ఎందుకో తెలియదు. సహజ కవచ కుండలాలతో అతడు పుట్టాడు. వాటికి ఏవో అద్భుత శక్తులున్నాయి. కాని వీటిని ఇంద్రునికి ఇచ్చాడు. మరి ఈ సహజ కవచం, మనం ఇంతకు ముందు చూసినట్లు ఇప్పటి వరకు కర్ణుడు చేసిన యుద్ధాలలో అతనికి ఏమాత్రం

దాని అద్భుత శక్తితో పనిచేసినట్లు కనపడదు. అసలు ఇంద్రుడు వాటిని కోరినప్పుడు తన శరీరం నుండి రక్తం కారుతుండగా వాటిని పెరికి అతనికి ఇవ్వవలసిన అగత్యం ఏమీ లేదు. తాను అంతటి ఉదారుడనని, దాత నని రుజువు చేసుకోవలసిన అవసరం ఏమిటి? కర్ణుడు ఎప్పుడూ గూడా మంచి, చెడూ - రెండింటిలోనూ అతికి పోతాడు. తన స్థానాన్ని గురించిన అభద్రతాభావం దీనికి కారణమా? తాను క్షత్రియుల కంటె ఎందులోను ఏమాత్రం తీసిపోనని రుజువు చేసుకోడానికి సహజ కవచ కుండలాలను దానం చేశాడా?

కర్ణుని జీవితంలో మహాదానందాన్ని ఇచ్చిన సంఘటనలు లేకపోలేదు. అవి రెండు: ఇందులో ఒకటి తానెవరో తెలిసిన సంఘటన. అప్పుడు అతని మనస్సులో ఏర్పడిన శంకాస్థితి నుంచి మహోదాత్తంగా అతడు బయటపడ్డాడు. అతడు జీవితమంతా శంకా స్థితిలోనే ఉండిపోయాడు. ఈ రెండు సంఘటనల్లో అతని ఆలోచనలు, చేతలు స్పష్టంగా, నిర్ణయాత్మకంగా ఉన్నాయి. కృష్ణుడు వచ్చి పాండవులతో చేరి పొమ్మని కర్ణుని అడుగుతాడు. ఈ సందర్భంలోనే అతడు కుంతి పెద్ద కొడుకని, ఆ కారణంగా అతడు పాండవులకు అగ్రజుడని చెప్పి, క్షత్రియునిగా అతనికి గుర్తింపు (అతడి జీవిత లక్ష్యం), ద్రౌపదిని పొందే అవకాశాన్ని గూడా కల్పిస్తామని, రాజ్యార్హతలన్నీ లభిస్తాయని కృష్ణుడు వాగ్దానం చేస్తాడు. కర్ణుడు ఇక్కడ చాలా హుందాగా ప్రవర్తించాడు. ఒక్క పరుష వాక్యం గూడ మాటాడకుండ అతడు యిలా సమాధానం చెప్పాడు: ''మీరడిగేది జరుగనిది. అసంభవం. నా జీవితం అంతా సూతుల మధ్య గడిచింది. నేను, నా కొడుకులు వారి పిల్లలనే చేసుకొన్నాం. ఇప్పుడు వారి నుంచి తెంచుకొని రాలేను ఏదైనా నేను రాజ్యాన్ని జయిస్తే దానిని దుర్యోధనునికి కానుకగా ఇస్తాను. నన్ను బలవంతం చేయకండి.'' అప్పుడు కృష్ణుడు ''సరే, అలాగే కానివ్వు''మని వెళ్ళిపోయాడు. కర్ణుడు మహోదాత్తుడని, నిజమైన స్నేహితుడని, ప్రేమ, విధులతో తనను పెంచిన కుటుంబానికి బంధితుడని, ప్రలోభానికి లొంగని వాడని ఈ సంఘటన రుజువు చేస్తుంది.

ఇక రెండో సంఘటన కర్ణ - కుంతీ సంవాదం. చాల ఉగ్రంగా మాట్లాడుతాడేగాని అందులో సంకుచిత మనస్కత గోచరించదు. కర్ణుడు గంగ ఒడ్డున సూర్య నమస్కారం చేస్తుండగా కుంతి వచ్చి అతనిని కలిసింది. నమస్కారం పూర్తిచేసిన అనంతరం, ఆమె దిక్కుకు తిరిగి, ''మీరు ఏమి పనిమీద వచ్చారు?'' అని అడిగాడు. అప్పుడామె అతని జన్మ రహస్యాధను వివరించి, ''పాండవులతో చేరు; కర్ణార్జునులంటే ఏమిటో ప్రపంచానికి చాటు'' అని కోరింది ''మీరు నా జన్మ రహస్యాన్ని వివరించినంత మాత్రాన నా కష్టాలు గట్టెక్కుతాయనుకొంటే మీరు పొరపాటు పడినట్లే! మీరు చెప్పిన కథ నన్ను క్షత్రియునిగా ధ్రువీ కరిస్తుందేకాని, నాకు విహితంగా జరుగవలసిన క్షత్రియ సంస్కారాలేవీ జరుగలేదు. పుట్టగానే మొదట జరగవలసిన జాతక కర్మ జరగలేదు. అప్పుడేమో మీరు నన్ను గాలికి వదిలివేశారు ఇప్పుడేమో స్వార్థ ప్రేరణంతో మాత్రమే నా దగ్గరకు వచ్చారు. కృష్ణుడు, అర్జునుడు అంటే ఎవరికైనా భయమే. ఇప్పుడు నేను కౌరవులను విడనాడితే అర్జునుడిని చూసి భయంతో పక్షం మార్చా నంటారు. నా బలాన్ని చూసుకొనే దుర్యోధనుడు ఈ యుద్ధానికి తలమునకల సన్నద్ధుడయ్యాడు. మీరడిగింది నేనెప్పటికీ చేయలేను. అర్జునుణ్ణి తప్ప, మీ సుతులలో అన్యు లెవరిని చంపను. అర్జునుడు నన్ను చంపితే మీ అయిదుగురు కొడుకులు

మీకు ఉంటారు. అలాకాక నేనే అర్జునుని చంపితే, అప్పుడూ మీకు ఐదుగురు పుత్రులుంటారు,'' అని కర్ణుడు కుంతికి చెప్పాడు. అప్పుడు కుంతి, ''అయితే నీ మాట నిలబెట్టుకో'' అని చెప్పి వెళ్ళిపోయింది.

ఇక్కడ కర్ణుడు చెప్పినదాంట్లో ద్వేషం ఏమీ లేదు. కాని తాను అర్జునుని తప్ప తక్కిన వారిని చంపననే మాట పరీక్షకు నిలువదు. పైకి చూడడానికి అదేదో ఔదార్యంగా కనిపిస్తుందే కాని ఇది అతడు మామూలుగా ఆర్భాటంగా చేసిన ప్రతిజ్ఞలాంటిదే. అసలు అతనికి కుంతి అంటే ప్రేమగాని దయగాని లేదు. సోదరులంటే దయచూపవలసిన అవసరం అంతకంటె లేదు. అతడు సోదరులను చంపను అని అనడంలో అతనికి ఉన్నది ఔదార్యం, ప్రేమా కావు. జుగుప్స. అతని వాగ్దానం వెనుక ఉంది సములతో తప్ప అసములతో పోరుసేయరాదని. ఈ జుగుప్స, అతి విశ్వాసం, అతిశయం క్షత్రియులకు సహజమే. అయితే ఇక్కడ అది అసందర్భ ప్రేలాపన ఇప్పుడు జరుగుతున్నది నిజమైన యుద్ధం. యుద్ధంలో దుర్యోధనుని గెలిపించవలసిన బాధ్యత అతనికి ఉంది. అంతేగాని వ్యర్థ ప్రేలాపన గాదు అతడు చేయవలసింది. సోదరులను, ముఖ్యంగా ధర్మరాజును, చంప ననడంలో దుర్యోధనుని కార్యానికి విఘాతం కలుగుతుంది. దుర్యోధనుని అవసరాన్ని విస్మరించి, డాంబికతతో కొట్టుకుపోయాడని చెప్పవలసి వస్తుంది.

ఈ సంఘటన అతడు నిజంగా ఎవరో అతనికి తెలియ జెప్పింది. దీనితో అంతః సంఘర్షణ, అంతరంగ అభద్రత పరిష్కృతమై ఉండాలి. అయితే పైకి మాత్రం అతడు ఈ నూతన గుర్తింపును స్వీకరించి, తదనుగుణంగా ప్రవర్తించలేడు గనుక, ఆ గుర్తింపును పరిత్యజించాడు. తన స్నేహితునికి బాసటగా నిలిచినందుకు ఆ నైతిక విభవాన్ని పొందగలిగాడు. కాని తరువాతి కాలంలో అతడు మళ్ళీ పాత గాడిలోనే పడిపోయాడు. అతడి చర్యలే అతని పతనానికి దారితీశాయి. ఇతరులూ అతనిని క్షమించలేదు.

మహారథుల ఎంపికలో భీష్ముడు కర్ణుణ్ణి రెండో శ్రేణి వానిగా నిర్ణయిస్తాడు. ఈ అంచనా కర్ణుని సామాజిక అంతస్తును ఆధారం చేసుకొని చేసింది కాదు. అతని వైయక్తిక పరిమితులు, దోషాలు ఆధారంగా చేసింది మాత్రమే. దీనితో కర్ణునికి కోపం వచ్చింది కాని, తరువాతి సంఘటనలు భీష్ముని తీర్పే సరైనదని రుజువు చేశాయి. మహారథి అంటే, రథం మీద నిలబడి బాణాలు వేయడమేకాక రథాన్ని నడపడం గూడ చేత కావాలి. భీష్మ, కృష్ణ, అర్జునులకు రెండూ తెలుసు. కర్ణుడికి రథంపై నిలబడి యుద్ధం చేయడమే తెలుసుకాని, రథం నడపడం రాదు. నడుస్తున్న రథం మీద నుండి బాణాలు సరిగా సంధించాలంటే రథం నడపడం, తెలిసిన వాడే రథగతి అర్థమై, సరిగా సంధించ గలుగుతాడు. భీష్మ కర్ణుల ఈ తగవు కారణంగా కర్ణుడు భీష్ముని క్రింద యుద్ధం చేయనని అలిగి కూర్చున్నాడు. తొమ్మిది రోజులు యుద్ధంలో పాల్గొనలేదు. ఇక్కడ కర్ణుడు తన అభిమానం చూసుకొన్నాడే కాని, దుర్యోధనుని హితాన్ని చూడలేదు. (కర్ణుడు గనుక యుద్ధంలో పాల్గొంటే భీష్ముడు యుద్ధం చేయ నిరాకరించాడని పాఠాంతరం.)

ద్రోణుడు కూడా భీష్ముని అభిప్రాయాన్నే బలపరిచాడు : ''కర్ణునికి తల బిరుసు. పాత్ర తెలియక కరుణ కురిపిస్తాడు. యుద్ధంలో వెన్ను చూపుతాడు. తప్పుడు నిర్ణయాలు చేస్తాడు. రథికునిగా అతనికి పూర్తి మార్కులు వేయలేను.'' ఆ రోజుల్లో ద్రోణుడు యుద్ధ విద్యల్లో ఆరితేరినవాడు. అతడి విమర్శనైనా కర్ణుడు కాతరు చేయవలసింది. కాని అతడు ఆత్మవిమర్శ చేసుకోలేదు.

భీష్ముని అనంతరం కర్ణుడు రంగప్రవేశం చేశాడు. సైన్యం అతనిని సేనానిని చేయమని కోరింది. అప్పుడు కర్ణుడు ద్రోణుని సేనానిగా చేయవలసిందిగా సూచించాడు ద్రోణుడు మూడు రోజులు నాయకత్వం వహించాడు. ఈ మూడురోజుల్లో కర్ణునికి అర్జునుణ్ణి ఎదుర్కొనే సందర్భం లభించలేదు. ఈ లోపు పదునారేడుల బాలుడు అభిమన్యుని ఆరుగురు యోద్ధలు చంపితే, ఈ ఆరుగురిలో కర్ణుడూ ఒకడు. ఆ పిల్లవాని రథం విరిగిపోగా, అతడు నేలపైదూకి అక్కడినుంచే ఆ ఆరుగురు మహా వీరులను ఒంటరిగా ఎదుర్కొన్నాడు పదహారవదినం ద్రోణుని అనంతరం కర్ణుడు నాయకత్వం స్వీకరించాడు. అప్పటికే ఇరువాగులవారు ఎంతోమంది చనిపోగా, పాండవులు కొద్ది ఆధిక్యంలో ఉన్నారు. ద్రోణుని కొడుకు అశ్వత్థామ సంధిచేసుకోమని దుర్యోధనునికి సలహా ఇచ్చాడు. కర్ణుని అండ చూసుకొని, ఎవరూ సాధించలేనిది కర్ణుడు సాధిస్తాడని దుర్యోధునుడు గురుపుత్రుని సలహా చెవిని పెట్టలేదు. కాని కర్ణుడు అనితరమైన దేదీ సాధించలేదు.

తరవాత రోజు శల్యుని రథసారథ్యం వహించమని కర్ణుడు కోరాడు. క్షత్రియుడు, ఒక దేశానికి రాజు అయిన తాను ఒక నీచకులజునికి సారథ్యం చేయడంకంటె ఇంటికి పోవడం మంచిదని శల్యుడు అన్నాడు. ఎలాగో దుర్యోధనుడు బ్రతిమిలాడి శల్యుని ఒప్పించాడు. శల్యుడు రథంతోలుతూ ఉండగా మార్గమధ్యంలో శల్యునికి కర్ణునికి సంవాదం జరిగింది. బహుశా ఈ సంవాదం తరువాతి కాలంలో ప్రక్షేపింపబడి ఉండచ్చును శల్యుడు ఇలా అంటాడు: ''ఊరికే డాంబికాలు పోకు. అర్జునుణ్ణి చూడగానే నీకు గుండె జారిపోతుంది.'' ఇలాంటి హెచ్చరికలు అధిక్షేపాలు సైనికునికి కోపం తెప్పించడానికి చెబుతారు. అర్జునుడు యుద్ధం సేయనని విల్లంబు క్రింద పడవేస్తే, కృష్ణుడు అతనిని అధిక్షేపించి, కోపం తెప్పించి, యుద్ధానికి పురికొలుపుతాడు. శల్యుడన్న మాటలకు కర్ణుడు కుపితుడై, శల్యుని రాజ్యమైన మద్రలోని స్త్రీలంతా త్రాగుబోతులు, తిరుగుబోతులు, గోమాంస భక్షకులు అని తిడతాడు. ఈ సంవాదాన్ని మనం అంతగా నమ్మడానికి వీలులేదు. తరతరాలుగా మద్ర, హస్తినాపుర రాజవంశాల మధ్య పిల్లల్ని ఇచ్చి పుచ్చుకోవడాలు ఉన్నాయి. పైగా శల్యుడు హస్తినాపురానికి బంధువు. రాజు. అతనిని కర్ణుడు అలాంటి మాటలన్నాడంటే నమ్మడం కష్టం. అయితే ఈ పాఠం మహాభారతం critical editionలో గూడా ఉంది. అసలు ఆ రోజుల్లో క్షత్రియ స్త్రీలంతా త్రాగేవారు, గోమాంస భక్షణ చేసేవారు. అది మామూలే. త్రాగుడు నిషేధం తరువాతి కాలానికి సంబంధించింది

కర్ణుడు ఈవిధంగా ప్రేలిన తరవాత శల్యుడు మాటాడడం ఆపివేశాడు. బహుశః అర్జునుని అనుకరించడానికేమో! రథానికి తెల్ల గుర్రాలను పూన్చవలసిందని కర్ణుడు ఆదేశించాడు. ఇది వట్టి తెలివిమాలినపని. యుద్ధంచేయ డానికి నమ్మకమైన సారథి, సుశిక్షితమైన, చిరపరిచితమైన గుర్రాలు, అలవాటైన రథం ఉండాలి. ఇది సామాన్య సూత్రం. దీనిని అతడు పాటించి ఉండాల్సింది. ఇప్పటికే అతని సారథి (శల్యుడు) అతనికి కొత్తవాడు. పైగా గుర్రాలను గూడా మార్చమని ఆదేశం. అతడు వేసిన మొదటి అడుగే తప్పటడుగు. మామూలు ప్రకారం ఈ రథం వెనుక విల్లంబులు, బాణాలు పెట్టుకొని మరో రథం అనుసరించి వస్తున్నది కౌరవ శ్రేణుల మధ్యకు పోయి, ''అర్జునుడు ఎక్కడ? నాకు చూపండి. అతడిని ఎవరూ చూడలేదా? నాకెక్కడా కనిపించడేం?'' అని కర్ణుడు అరిచాడు. శల్యుడు అప్పుడు అర్జునుని దిశగా రథం నడిపించి ''అడుగో అర్జునుడు. దుర్యోధనుని రుణం తీర్చుకొనే సమయం ఇదే'' అన్నాడు. అక్కడకు వెళ్ళేసరికి అతని కొడుకు వృషసేనుడు అర్జునుని ఎదుర్కొంటున్నాడు. కర్ణుడు ఏదైనా చేయగలిగేలోపే అర్జునుడు వృషసేనుని చంపాడు దీనితో కర్ణుడు మూగవోయాడు. కన్నుల

నీరు నిండింది. అప్పుడు అర్జునుని ఎదుర్కొన్నాడు. క్రమంగా అర్జునినిది పైచేయి అయింది. కర్ణుని కవచం ముక్కలైంది. నిస్పృహతో నాగాస్త్రాన్ని అర్జునునిపై సంధించ్చాడు. (పాము కూర్చున్న బాణం - బహుశ దీని అర్థం అది విషపూరితమని, అది తాకినవారు విషగ్రస్తులై చనిపోతారని). ''అర్జునుని కంఠానికి మీరు బాణం ఎక్కుపెడితే, మీ గురి సరిగా లేదు. సరి చూసుకోండి,'' అని శల్యుడు హెచ్చరించాడు. కర్ణుడు దానిని పెడచెవిని బెట్టాడు. అది గురితప్పి అర్జునుని కిరీటాన్ని తాకింది దీనికి మరో పాఠం గూడ ఉంది. ఈ బాణం వస్తున్నప్పుడు కృష్ణుడు రథాశ్వాలను మునిగాళ్ళమీద వంచి, రథాన్ని 24 అంగుళాలు క్రిందికి దించాడట. ప్రతి సంఘటనను కృష్ణుని గొప్పతనాన్ని పెంచడానికి కలిపినట్లే, ఈ సంఘటన తరువాతి కాలంలో కృష్ణుని గొప్పతనాన్ని పెంచడానికి కలిపి ఉండవచ్చు.

ఏది ఏమైనా కర్ణుడు గురి తప్పడానికి అప్పుడే చనిపోయిన పుత్రుని వలని శోకం కారణం కావచ్చు. ఇదే సమయంలో అతని రథం బురదలో కూరుకు పోయింది (ఇది యుద్ధం మొదలైన 17వ రోజు). కర్ణుడు రథం మీదినుంచి క్రిందకు దూకి కూరుకుపోయిన చక్రాన్ని పెకలించ ప్రయత్నించాడు. ఇది ఒక మనిషికి సాధ్యమయ్యే పనికాదు. అదీగాక యుద్ధం మధ్యలో. అసలు అతడు మరో రథానికి ఎందుకు మారలేదో మన కర్థం కాదు. సూర్యాస్తమయ మవుతోంది నాటికి యుద్ధం చాలించే సమయం ఆసన్నమైంది. కొంత వెసులుబాటు దొరుకుతుందేమోనని కర్ణుడు ఆశించాడు. అతడు అర్జునుని ఇలా అర్థించాడు:

''కూరుకు పోయిన చక్రాన్ని పెకలిస్తున్నాను. యుద్ధనీతి నీ వెరుగనిది కాదు. రథం మీద ఉండి నేలమీద ఉన్నవానితో పోరాడరాదు. యుద్ధనీతిని పాటించు.''

కృష్ణుడికి కర్ణుని వదలిపెట్టడం ఇష్టం లేదు; కృష్ణుడు కర్ణుని మాటలను కర్ణునికి అప్పచెప్పాడు: ''ద్రౌపది వలువలు వలవమని దుశ్శాసనుని నియోగించినప్పుడు ఈ నీతి ఏమైంది? మీరు ఆరుగురు కలిసి ఒక బాలుని, అతడు నేలపై ఉన్నప్పుడు, పడగొట్టినప్పుడు నీ యుద్ధనీతి ఏమైంది?''

పాపం! అర్జునిడికి వదిలిపెడదామనే ఉంది. కాని కృష్ణుడు అర్జునునికి విధి తెలిపి, పురికొలుపుతాడు. కృష్ణుడు ఈ ప్రశ్నలు వేయడం ద్వారా కర్ణునికి న్యాయమడిగే అర్హత లేదని తెలియజేశాడు. అంతేకాక అర్జునునికి జరిగిన రెండు అన్యాయాలను అతనికి గుర్తుచేశాడు. ''ఇతడు నా భార్యను అవమానించాడు. నా పుత్రుని క్రూరంగా చంపాడు. ఇతను బ్రతకడానికి వీలులేదు,'' అంటూ విల్లు ఎక్కుపెట్టి, ''ఈ బాణం కర్ణుని అంతంచేసి, నన్ను సుక్షత్రియునిగా ప్రతిష్ఠించుగాక,'' అని అర్జునుడు బాణం వేశాడు. అది గురి తప్పలేదు. అర్జునుడు గురి తప్పడం ఎరుగడు.

మహాభారత గాథలో కర్ణుడు మొదట శస్త్రాస్త్ర విద్యా ప్రదర్శనలో ప్రవేశిస్తాడు. అప్పుడతడు అర్జునుని ద్వంద్వ యుద్ధానికి సవాలు చేస్తాడు. అదే సవాలును ఎదుర్కొనే అవకాశం ఈ చరమాంకంలో వచ్చింది. అప్పుడది చిన్న పిల్లల ఆట. ఇప్పు డది నిజమైన యుద్ధం. చంపడమో, చావడమో - రెండే దారులు. తాను జీవితాంతం ద్వేషించిన, అసూయపడిన శత్రువును ఎదుర్కొంటున్నాడు. అటువంటి శత్రువు నుంచి ఏరకమైన ఆపేక్షను యాచించ ఉండవలసింది కాదు. మళ్ళీ ఇక్కడ కర్ణుడు ఎన్నడూ చేయరాని పని చేశాడు. ''తానేమిటి? తన హక్కులేమిటి?'' అని తెలుసుకోకుండానే కర్ణుడు అంతమయ్యాడు.

# శేష్ర

★ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రహదారిలో మ

★ సినిమా, T.V. లలో కనపడే దం

★ తల్లిదండ్రులపై చూపే నిర్ర

★ నీలో నేర ప్రవృత్తి -

★ కన్సూమరిజం,

★ సమష్టిక

★ నీ

# జనాభా పెరుగుదలే సర్వ

అమెరికా పత్రికా చరిత్రలో అపూర్వమైన ఒక సంఘటన గత సెప్టెంబరు నెలలో జరిగింది ఒక ఉగ్రవాది బెదిరింపులకు లొంగి, అమెరికాలో అతి పెద్ద సర్క్యులేషన్ గల వాషింగ్టన్ పోస్ట్, న్యూయార్క్ టైమ్స్ పత్రికలు అతను ఇచ్చిన సుదీర్ఘమైన ఒక విమర్శనా వ్యాసాన్ని యధాతధంగా ప్రచురించాయి. ఈ వ్యాసాన్ని ప్రచురించకపోతే లెటర్ బాంబును పంపి చంపుతానని బెదిరింపు. ఈ రెండింటిలో ఏ ఒక్క పత్రిక అయినా 35,000 పదాల ఈ వ్యాసాన్ని ప్రచురిస్తే, తను ఇక ముందు తన లెటర్ బాంబుల ఉద్యమానికి స్వస్తి చెప్తానని హామీ. ఈ రెండు పత్రికలు మూడు నెలల పాటు సంప్రదింపులు జరిపి, కేంద్ర నేర పరిశోధక శాఖ వారితో సంప్రదింపులు, సలహాల మేరకు ఈ ప్రచురణ చేస్తున్నట్లు న్యూయార్క్ టైమ్స్, వాషింగ్టన్ పోస్ట్ సంయుక్తంగా ప్రకటించాయి సాంకేతిక సౌకర్యం కారణంగా, విడిగా ముద్రించి వాషింగ్టన్ పోస్ట్ పత్రికలో పంపిణీ చేసినప్పటికీ, సుమారు 40,000 డాలర్ల ఖర్చును రెండూ సమంగా భరించాయి.

నిజానికి ఈ సంఘటనకు బీజాలు 1978 లోనే పడ్డాయి. యూనా బాంబర్ (Unabomber) అనే రహస్య నామంతో జరిగిన 'బాంబు' దాడిలో ముగ్గురు మరణించారు, 23 మంది గాయపడ్డారు. ఆ తర్వాతి కాలంలో మరో 16 దాడులు జరిగాయి. ఈ వ్యక్తి ఎవరో ఇంత వరకు బహిర్గతం కాలేదు. కాని ఈ దాడులు, ఈ ఉద్యమం, నేటి సమాజంలో చోటు చేసుకుంటున్న విపరీత ధోరణుల పట్ల తీవ్ర వ్యతిరేక భావానికి ఒక లక్ష్యం అనవచ్చు. 'ఆధునిక సమాజం ఎదుర్కొంటున్న సామాజిక, మానసిక సమస్యలకు మూల కారణం - మానవ జాతి సహజ

సేకరణ :
'మిసిమి' రచనల
వర్క్‌షాపు

# శ్నలు

వుని గమ్యమేది ?

తులు మన కాదర్శమా ?

మలో నిస్వార్థత పాలెంత ?

బ్బు దాహం ఎక్కువ వుతున్నావా ?

మార్కెట్ ఎకానమీ ఎంత వరకు కారణము ?

టుంబాలకి కాలం చెల్లినట్లేనా ?

కుటుంబంలోనే నీవు వంటరితనం ఫీలవుచున్నావా ?

## అరిష్టాలకు మూలమా ?

వికాసానికి భిన్నమైన పరిస్థితులలో మానవులు జీవించ వలసి రావడమేనని నా అభిప్రాయం' అని యూనాబాంబర్ ఒక సందర్భంలో పేర్కొన్నారు. నేటి సమాజంలో వ్యక్తమవుతున్న అసంతృప్తి, నిస్సహాయత, నిరాశా నిస్పృహలు ఈ స్థితి బాహిర లక్షణాలు.

ఒక విధంగా చూస్తే యూనా బాంబర్ ఆవేదన మనందరిలో ఎంతో కొంత ఉంది. మనం అతను దీనిని వ్యక్తం చేసే విధానాన్ని సమర్థించక పోవచ్చు. కాని ఆవేదన మాత్రం మనకు సుపరిచితమైనదే గదా! దీనినే అతను సవివరంగా తన విమర్శనా వ్యాసంలో చర్చించాడు. నేటి సమాజంపై ఇది అతని అభిశంస. శాస్త్ర సాంకేతికంగా ఎంతో అభివృద్ధిని సాధించినప్పటికీ, ఈ సమాజం మానవ జీవితాలకు తృప్తి కలిగించ లేనిది. మనుష్యులు సమాజ జీవన విధానాలకు పూర్తిగా భిన్నమైన స్థితులలో ఉండవలసి రావడంతో, దీనికి అనుగుణంగా సర్దు కోలేక ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు. దీనితో తట్టుకో లేనంతటి దైనందిన జీవిత భారం, ఇంతమంది మధ్యలో కూడా సామాజికంగా ఒంటరి తనం భరించలేక అతను వ్యధ చెందుతున్నాడు. ఇదీ అతని ఆవేదన స్థూలంగా. జీవితానికి ఒక లక్ష్యం లేకుండా నిరర్థకమైన ఆలోచనల్లో మునిగి పోవడం, లేక రోజుల తరబడి పరిష్కారం లేని ఆందోళనతో క్రుంగి పోవడం, రోజుల తరబడి నిరంతరంగా పని ఒత్తిడి వలన కుటుంబంతో ఆప్యాయతను సరిగా పంచుకోలేక పోవడం, ఎక్కువ కాలం వారితో గడప గలిగినా, అది రాశిలోనేగాని వాసిలో లేకపోవడం ఇలాంటివే మరెన్నో కారణాలు, లక్షణాలు. మానవులుగా పుట్టిన మనకు ఆధునిక సమాజం అనుకూలమైంది గాదనే భావం అమెరికన్లలో అప్పుడప్పుడు కలుగుతూ ఉంటుంది.

మానవుడు - అతని ఆలోచనలు, కోరికలు, అవసరాలు, ఎమోషన్లు, అన్నీ - ఈనాటి ఆధునిక పరికరాలు సౌకర్యాలు - సెల్యులర్ ఫోన్లు - ఆ మాటకు వస్తే అసలు ఫోన్లు, టెలిగ్రాములు, కార్లు, రైళ్లు, వాహనాలు - లేని వాతావరణంలో వికసించాయి అంటే ''సివిలిజేషన్ అండ్ ఇట్స్ డిస్ కంటెంట్స్'' లో ఫ్రాయిడ్ ఊహించిన స్థితి అన్నమాట అయితే ఆ విశ్లేషణ ఖచ్చితమైన నిర్ణయాలకు దోహదం చేయలేక పోతున్నది. మానవ జాతి వికాసం గురించిన ఫ్రాయిడ్ ఆలోచనలు ఈ నాడు వర్తించ వనవచ్చు ఉదాహరణకు, మన పూర్వీకులు నియంత అయిన ఒక మగవాని నాయకత్వంలో ఒక గుంపుగా జీవిస్తూఉండేవారని, అతని కుమారులు అతనిపై తిరుగుబాటు చేసి, అతన్ని చంపి, అతని మాంసం తినేవరకు ఇది కొనసాగిందని ఫ్రాయిడ్ ప్రతిపాదించాడు ఇది మతానికి నాంది పలికిందని, ఆ తర్వాతి తరాల వారిలో (మనలో కూడా) guilt feeling తప్పు చేశామన్న భావం మనస్సులో మిగిలిపోయిందని ఆయన సిద్ధాంతం.

మానవ వికాస మనోవైజ్ఞానికులు కొందరు ప్రకృతి సహజ నిర్ణయాల ప్రభావంతో మానవ మేధస్సు పరిమాణాల వివరాలను నిర్ధారించడానికి కృషి చేస్తున్నారు. ఆధునిక సమాజానికి, మన ప్రాచీన స్థితి గతులకు మధ్య తేడాలు ఆధారంగా - పొంతన కుదరని స్థితి ఏర్పడుతూందని కూడా వీరు భావిస్తున్నారు ఈ స్థితి ఫలితంగా ఎదురయ్యే వివిధ సమస్యలను వీరు అధ్యయనం చేస్తున్నారు ఇలాంటి సమస్యలకు లెక్క లేదు పారిశ్రామిక దేశాలలో మనిషిలో నిస్పృహ నానాటికీ విపరీతంగా పెరిగి పోతున్నది ఉత్తర అమెరికాలో ఆత్మ హత్యలు చాలా సామాన్యమైన విషయం - చావుల కారణాలలో ప్రమాదాలు, హత్యల తర్వాతి స్థానం ఆత్మ హత్యలదే అమెరికాలో 15 శాతం మంది ఏదో ఒక రకమైన ఆందోళనకు చికిత్స పొందుతున్నవారే హత్యా ప్రవృత్తి ఎక్కువైంది.

## యూనాబాంబర్ సరిగా ఈ రకమైన మనిషికి ప్రతీక!

మానవ వికాస మనోవైజ్ఞానిక పరిశోధనలు, ఈ నూతన ప్రవృత్తికి స్పష్టమైన సమాధానాలు చెప్పగల స్థితికి ఇంకా చేరుకోలేదు కాని, సాంప్రదాయికంగా వస్తున్న ఆలోచనలను ఖండించేందుకు తగిన సమాచారం అందించగలుగు తున్నారు. ఉదాహరణకు 1950 ప్రాంతాలలో ప్రాచుర్యంలోకి వచ్చిన సూక్ష్మ కుటుంబ వ్యవస్థ - భర్త ఉద్యోగం చేస్తూ, భార్య ఇంటిని చక్కదిద్దు కుంటూఉండే స్థితి - అసహజమైనదే గదా - ముఖ్యంగా ఇది భార్యల విషయంలో మరీను. మానవ వికాస పరిణామంలో అమెరికన్ జీవన విధానం చాల వరకు సహజంగానే ఉండేది - అయితే పెట్టుబడిదారీ వ్యవస్థ వలన ఇది చాలవరకు పతనమైంది మితవాద సంప్రదాయాలకు పెట్టుబడిదారీ విధానం పెద్ద సవాలు అనవచ్చు. మానవ వికాస మనోవిజ్ఞానంలో ఆశ్చర్య కరమైన విషయం మనిషిలోని పశుత్వాన్ని వివరించడం ఫ్రాయిడ్ మొదలుగా గల జిజ్ఞాసువుల దృష్టిలో 'నాగరికత' మనిషిలోని ప్రాతిపదిక పశు లక్షణాలను అణచి వేస్తుంది. మానవ వికాస మనోవైజ్ఞానిక శాస్త్రంలో మానసిక రుగ్మతలకు గల కారణాలలో నాగరికత మానవత్వాన్ని అణచి వేసే పద్ధతి ఒకటి మానవ ప్రకృతిలో దయార్ద్రమైన, సున్నితమైన దృక్కోణం ఉంది నిజానికి అణచి వేతకు ఇది విపరీతంగా గురి అవుతున్నది.

గతించిన లక్షలాది సంవత్సరాల కాలంలో మానవ మేధస్సును ప్రభావితం చేసిన సామాజిక సందర్భాలను గురించి మనకు ఏమీ తెలియదు వీటిని ఊహించి ఒక చారిత్రక క్రమం

నిర్ధారించడానికి - మన ప్రాచీన వాతావరణాన్ని నిర్ధారించడానికి - మానవ వికాస మనో వైజ్ఞానికులు తీసుకునే ఆధారాలు - సాంకేతికంగా ఆదిమ సమాజాలను గురించిన అభిప్రాయాలు. నిజానికి యూనాబాంబర్ వుందతం ప్రశంసించే సమాజాలు అవే. వేటాడి ఆహారం సంపాదించుకునే ఆదిమ సమాజాలు - మనుష్య వర్తన శాస్త్రజ్ఞులు ఈ శతాబ్దంలో పరిశీలించిన సమాజాలు ఇందుకు ఆధారం. జపాన్‌లోని ఐను, ఆఫ్రికా మధ్య ప్రాంతంలోని కుంగ్ సాన్, దక్షిణ అమెరికాలోని ఆచే జాతులు ఇందుకు ఉదాహరణలు. 'నాగరిక సమాజం'తో సంబంధాలు కలిగిన ఆదిమ జాతుల జీవన సరళిలో పెద్ద మార్పులు వచ్చాయి. వ్యవస్థ సంకరమైంది.

ఈ ఆదిమ సమాజాలు ఏవీ కూడా అన్ని విధాలా సరియైన సమాధానం కాదు. జీన్ జాక్వెస్ రూసో ప్రతిపాదించిన 'కరుణామయులైన ఆటవికుల' సిద్ధాంతాన్ని గాని, 'ఆనాటి మన పూర్వీకులు' పశువులలాగా దుర్భర జీవితం గడిపే వారనే థామస్ హాబ్స్ అభిప్రాయాన్ని గాని సమర్థించే సమాచారాన్ని శాస్త్రజ్ఞులు అందించ లేకపోయారు. ఆ సమాజాలలోని ముష్టా ముష్టి పోరాటాలు, ఇతర బల ప్రయోగం వంటి వాటితో పాటు, తరచు ఆకలి బాధలు, వ్యాధులు ప్రబలుతుండేవి. రక్షణ లేక ఏ క్రూర మృగమో తినేసే ప్రమాదం కూడా నిత్యం ఎదురవుతుండేది. యూనా బాంబర్ ప్రశంసించే ఆ నాటి ఆదర్శ సమాజం నేటి మనకు వాంఛనీయం కాదనడానికి ఈ ప్రమాదాలను ఎత్తి చూపుతున్నారు. ''యూనా బాంబర్ నేటి పారిశ్రామిక యుగం నుండి వేల ఏళ్ల వెనక్కు తీసుకు పోవాలంటే మన సమాజం సిద్ధంగా లేదు'' అని విజ్ఞాన శాస్త్ర చరిత్రకారుడు డేనియల్ లెవ్ లేస్ స్పష్టం చేశారు

అటువంటి సమాజంలో జీవించడానికి యిష్టపడకపోయినా, ఆనాటి స్థితి గతులను గురించి గుణ పాఠాలు నేర్చు కొనడానికి విముఖులమని గాదు. అదే విధంగా శాస్త్రీయ, సాంకేతికాభివృద్ధి వలన చెడు పరిణామాలుండవనీ గాదు. అయితే వాహనాలు, విద్యుచ్ఛక్తి, టెలిఫోన్లు లేని ఆదిమ సమాజాన్ని గుడ్డిగా అంగీకరించకపోయినా, ఈనాడు రోజు రోజుకు పెరిగిపోతున్న నిరాశా నిస్పృహలకు కారణాలు తెలుసుకొనడానికి ప్రయత్నించవలసిన సమయం వచ్చినది.

ఆదిమ ఆటవిక సమాజంలో కనిపించిన ముష్టాముష్టి పోరాటాలు, బల ప్రయోగాలు నిజానికి సమాజంలో ఆధిక్యత కొరకు, ముఖ్యంగా మహిళ మనసును ఆకట్టుకోడానికి చేసే సున్నితమైన ప్రయత్నాలే నవచ్చు వీటిలో విజయుడైన మగవానికి తన 'వంశం' విస్తరింప జేసుకోడానికి అవకాశం లభిస్తుంది. ముందు తరానికి తాను బీజాలు (జీన్స్) వేయగలగడం మానవ మేధా వికాసానికి కేంద్ర బిందువు అదే నేటికీ మన ఆలోచన · సాంకేతికంగా ఆదిమ సామాజిక వ్యవస్థలో జీవించడానికి అనుగుణంగా రూపొందించినది మన మనస్సు : సామాజిక సహకార వైఖరి ఈ వంశోద్ధారణ కార్యము విజయవంతం కావడానికి తోడ్పడుతుంది. దీనికి ఆలంబనగా మైత్రి, అభిమానం, ప్రేమ, కృతజ్ఞత, విశ్వాసం వంటి లక్షణాలు రూపుదాలుస్తాయి. తమ వంశాంకురం ఈ లక్షణాలను తమనుండి పొంది తిరిగి ముందు తరాలకు అందించగలడన్న విశ్వాసం తల్లి దండ్రుల ప్రేమకు మూలాధారం. ముందు తరానికి తన బీజం వేయడం మంచికా? చెడుకా? అన్న విషయం అటుంచితే, మానవ మేథస్సు వికాసానికి ఇదే ముఖ్యమన్నది స్పష్టం. వంశవికాసానికి తోడ్పడే పైన పేర్కొన్న లక్షణాలే నేటికీ జీవించి ఉన్నాయి.

మనిషికి మిత్రు లున్నారు; శత్రువులు - సామాజికంగా పోటీ దారులు - ఉన్నారు. ఈర్ష్యా ద్వేషా లుంటాయి, అలాగే కృతజ్ఞతా భావం ఉండవచ్చు. ఇతరులంటే చెప్పలేని అనుమానం ఒక వంక, పూర్తి విశ్వాసం మరో వంక తన బీజాన్ని ముందు తరాలకు వ్యాపింప జేయడానికి తోడ్పడే మాధ్యమాలైన సంతానం గురించి గర్వపడనూవచ్చు, లేక పూర్తిగా అసంతృప్తి, ఆగ్రహం, ఆవేదన కలుగవచ్చు. ఒక వంక విజయోత్సాహం, మరో వంక పరాజయ వేదన. ఈనాడు మనలో ఇలాంటి అసంతోషకరమైన భావాలు ఉండటానికి, మన పూర్వీకులు తమ బీజాలను ముందు తరాలకు వ్యాప్తి చెందించడానికి తోడ్పడిన ఆ పరిస్థితులే కారణమని మానవ వికాస మనో వైజ్ఞానికుల సిద్ధాంతం. పిల్లలను గురించిన ఆందోళన వలన వారికొరకు ఆహారం దాచి ఉంచే లక్షణం ఏర్పడింది. సంఘ పరంగా చావు దెబ్బ తిన్న తర్వాత ఆత్మ విమర్శ వలన విరక్తి ఉండవచ్చు. (పరాయి వాని భార్యతో సంపర్కం వలన యిబ్బందులు కలుగుతున్నాయని భావించి ఉండవచ్చు.) ఒకనాడు తాత్కాలికంగా లాభం చేకూర్చిన బాధాకరమైన భావాలు ప్రతి నాగరకతలోను ఉన్నాయి వీటిని తప్పించుకోడం సాధ్యం కాదు. ఇది ప్రకృతి సహజమైన లక్షణం

అయితే యీ అసహజమైనది తట్టుకోలేక, వెర్రెత్తిపోయి మానసికంగా క్రుంగిపోవడం; ఈ ఆందోళన మనిషిని అచేతనంగా చేయడం, ఈ లక్షణాలు 'ఆధునికత'తో సంక్రమించిన వ్యాధులు సమోనా దీవిలోని ఆదిమ జాతులలోను, న్యూగినీలోని కలూలి జాతి ప్రజలలోను కనిపించే ఆందోళన, నిరాశ వంటి లక్షణాలను కలిగించే లేక వాటి వలన తయారయ్యే రసాయన పదార్థాలు వారిరక్తంలో కన్పించనేలేదు!

విరక్తి, దిగులు, ఆందోళన మానవ సహజ లక్షణాలే సామాజికంగా ఒంటరితనం వలన ఈ లక్షణాలు తీవ్ర రూపం దాల్చి, మానసికంగా క్రుంగి పోవడానికి దోహదం చేస్తవి. అమెరికాలో నాలుగో వంతు 'కుంటుంబాల'లో ఒక్కొక్క వ్యక్తి మాత్రమే ఉండటం గమనార్హం. 1940లో ఇది 8 శాతం మాత్రం ఉండేది (ప్రాచీన కాలంలో బహుశా ఇటువంటిది అనూహ్యం కావచ్చు. వేటాడి ఆహారం సేకరించుకొనే ఆనాటి ఆటవిక సమాజంలో ఎన్నో వైవిధ్యా లున్నప్పటికీ పరస్పర సహకారం, కుటుంబంలో స్థిరత్వం, తరతరాలుగా అదే బంధు మిత్రులతో కలిసి జీవించడం వారి లక్షణం. వివాహం, తదితర కారణాల వలన, లేక విడిపోయి మరో కుటుంబంలో ప్రవేశించినప్పుడు మరో గ్రామానికి, సమాజానికి వలస పోవడం జరుగవచ్చు. 1980లో అమెరికన్ టెలివిజన్‌కార్యక్రమం 'చీర్స్' ప్రసారమవుతున్నప్పుడు ఎందరో ఆసక్తితో తిలకించారు. పొరుగున బార్‌లో రోజా కాలక్షేప కార్యక్రమం అది. ఒక వంక పోటా పోటీలు, తగవులు ఉంటున్నప్పటికీ, వాటిని అరమరికలు లేకుండా సులువుగా పరిష్కరించుకో గలగడాన్ని, ఆందోళనలు లేకుండా తరచు వచ్చిపోయే మిత్రులతో కూడిన సమాజాన్ని ప్రతిబింబించేది అపాయింట్ మెంటు ముందుగా నిర్ధారించుకొని, ఏదో ఒకసారి మిత్రులకు కనిపించి, ముక్తసరిగా ముచ్చటించుకొనే మన సమాజానికి పూర్తిగ భిన్నమైన సమాజం అది. అటువంటి ప్రాచీన సమాజం ఏర్పడాలని అమెరికన్లు వాంఛించారని ఈ కార్య క్రమ ప్రేక్షకులపై జరిపిన సర్వేలో వెల్లడైనట్లు శాస్త్రజ్ఞులు జాన్‌టూబీ, లెడా కాస్మిన్స్ అభిప్రాయ పడ్డారు.

సామాజిక సన్నిహితత్వం వలన వ్యక్తి ప్రైవసీకి కొంత నష్టం కలుగుతుందని చిన్న పట్టణాలలో, గ్రామాలలో నివసించే వారికి బాగా తెలుసు. మనం ఏం చేస్తున్నామో అందరికీ తెలుస్తుంది.

మన మానాన మనం జీవించే అవకాశం కోల్పోతాము. అయితే ఆధునిక భావనలలో ఉన్న వారికి కాదు - అలనాటి పూరి పాకలలో నివసిస్తున్న ప్రజల జీవన వైఖరి అది.

ఈ ఇబ్బంది ఉన్నప్పటికి, సామాజిక పారదర్శకత వలన ఎన్నో లాభా లున్నాయి. పారిశ్రామిక సమాజానికి ముందు - క్రీస్తు పూర్వం 4000 ఏళ్ల ప్రాంతానికి చెందిన వందలాది జనావాసాలలోని 5000 మంది పిల్లల అస్థి పంజరాలను పరిశీలించిన మనుష్య వర్తన శాస్త్రజ్ఞుడు ఫిలిప్ వాకర్ ఆ నాటి పిల్లలలో శారీరక బాధలకు గురిఅయిన లక్షణాలు కన్పించలేదని నిర్ధారించారు. సంవత్సరం నుండి నాలుగు సంవత్సరాల లోగా చనిపోయిన పిల్లలలో ఎములకపై దెబ్బలు, గాయాలు, ఆధునిక సమాజంలో 5 శాతం వరకు కన్పిస్తున్నట్లు ఆయన అంచనా. అనాది కాలంలో సమాజంలో అవసరం లేదనుకున్న పిల్లలను పుట్టిన వెంటనే చంపి వేయడం ఒక కారణం కావచ్చు. లేక, పిల్లల పెంపకం సామాజిక బాధ్యతగా భావించినందు వలన కూడా ఇది జరిగి ఉండవచ్చునని శాస్త్రజ్ఞుడు హాబ్స్ నిర్ధారణ. పిల్లలకు కుటుంబ పెద్దలు తాత అవ్వలు, పెద నాన్నలు, పెద్దమ్మలు వగైరాలు ఈ బాధ్యతను జాగ్రత్తగా నిర్వర్తించేవారు.

1950 నాటి సమష్టి కుటుంబాలపై మోజుతో, 'కుటుంబ విలువల'ను గురించి మాట్లాడటం విచిత్రం అని టూచీ, కాస్మిగ్స్ విమర్శిస్తున్నారు. టెలివిజన్‌లో గొప్పగా చూపించిన మే బెర్రీ సమాజానికి, మననేటి సమాజానికీ ఎంతో తేడా ఉంది. సమష్టి కుటుంబాలు విచ్ఛిత్తి కాకుండా చూడటం మానవ మనో విజ్ఞాన వికాసానికి ఎంతగానో తోడ్పడుతుంది. ముఖ్యంగా మారు తండ్రులు పిల్లల పట్ల జరిపే అత్యాచారాలకు అవకాశం లేకుండా చేయడం జరుగుతుంది. జన్మనిచ్చిన తల్లిదండ్రులు పిల్లలపై అఘాయిత్యాలు చేయడం తక్కువ అని శాస్త్రజ్ఞులు మార్టిన్ డానీ, మార్గో విల్సన్‌ల సిద్ధాంతం అయితే 1950 నాటి గ్రామీణ జీవితాన్ని మెచ్చుకోడం అంటే మన సమకాలీన జీవితంలోని వివిధ అంశాలను విస్మరించడమే.

నేటి మన ఆధునిక సమస్యలన్నిటికి, పట్టణ సంస్కృతిపై మన మోజే కారణమని కొందరు అంటున్నప్పటికి, ఈ శతాబ్దం మధ్య కాలంలో పట్టణంలో జీవితం చాలా వరకు సమాజ ప్రధానమైనదే. ఊళ్లోకి వచ్చిన కొత్త వారు స్థానికుల పరామర్శలకు గురికాకుండా తప్పించుకోలేరు. అయితే పట్టణాల సమీపంలో వృద్ధి పొందిన 'శివారు' సంస్కృతి ఇటు ఒంటరి జీవితాల, అటు సామాజిక సంబంధాల మేళవింపు. తమ తమ ఇరుగు పొరుగుల మధ్యనే ఒంటరి తనం అనుభవిస్తున్నారు. ఈనాటి ఆధునిక పరికరాల పుణ్యమా అంటూ ఇంటికి వచ్చిన కారు మీట నొక్కి గేటు తెరుచుకొని నేరుగ గరాజ్‌లోనికి వెళ్లడం సాధ్యమైంది. అంటే ఆ కొద్ది క్షణాలు కూడా పొరుగింటి వారితో పిచ్చా పాటికి అవకాశం, అవసరం లేకుండా పోయింది.

ఈ శివారు సమాజంలో చిన్న పిల్లలున్న మహిళలకు చాలా కష్టాలు ఎదురౌతాయి. అనాది కాలపు వేటాడి ఆహారం సేకరించుకొనే ఆటవిక కుటుంబాలలో మహిళ తన యింటా బయటా పనులను సునాయాసంగా సమన్వయ పర్చుకో గలిగేది తను వేటకు వెళ్ళినప్పుడు పిల్లలు తన వెంట ఉండేవారు, లేకుంటే ఇంటి దగ్గర పెద్దవారు చూసుకొనేవారు తిరిగి వచ్చిన తర్వాత మళ్లీ తన దగ్గరే ఉండేవారు. చిన్న పిల్లల పెంపకం బాధాకరమైన విషయంగా భావించరు అని ఆఫ్రికాలో అటువంటి సామాజిక జీవితాన్ని అధ్యయనం చేసిన మనుష్య వర్తన శాస్త్రజ్ఞుడు మార్జోరీ సోష్టక్ వివరించాడు.

1950వ సంవత్సరం ప్రాంతంలో ప్రారంభమైన ఈ శివారు జీవిత విధానం అసలు రూపు దాల్చడానికి, అందునా మహిళా ఉద్యమం బల పడటానికి కారణాలను వికాస మనో విజ్ఞాన శాస్త్రం వివరిస్తుంది. 1959లో బెట్టీ ఫ్రీడెన్ శివారు గ్రామాలలోని మహిళలతో, ముఖ్యంగా తల్లులతో - జరిపిన చర్చల ఆధారంగా 1963లో 'ది ఫెమినైన్ మిస్టిక్' అనే గ్రంధం రచించారు. ఒక తల్లి వ్యక్తం చేసిన బాధ, కోపం, నిస్పృహలను 'ది ప్రాబ్లమ్ విత్ నో నేమ్' (అనామక సమస్య) అని వర్ణించారు. ఇంటి దగ్గర పిల్లలను పెంచే ఇల్లాళ్లు, ఉద్యోగాలు చేసుకొనే మహిళల కంటె 'అధికంగా నిస్పృహ'కు గురి అవడం సహజం కనుక వారు తిరుగుబాటు చేయాలని ఆమె సూచన.

ఉద్యోగాలు చేసే పురుషుల కంటె, ఉద్యోగాలు చేసే తల్లులు మానసికంగా క్రుంగిపోయే అవకాశాలు ఎక్కువ. మహిళలు తల్లులుగ, ఉద్యోగినులుగ తమ బాధ్యతలను నిర్వర్తించుకొనడానికి అనువైన స్థితిని కల్పించడం మనం ఎదుర్కొంటున్న సామాజిక సవాళ్లలో ముఖ్యమైనది.

యూనా బాంబర్ అభిప్రాయంలో ఈ సమస్యకు చాలవరకు సాంకేతిక పరిజ్ఞానంలో వస్తున్న మార్పులు కారణం. శివారు జీవిత సంస్కృతికి ఆటోమొబైల్ ఆధారం. అమెరికాలో కార్ల యుగానికి నాంది పలికిన ఫోర్డ్ కంపెనీ అధిపతి హెన్రీ ఫోర్డ్ తన స్వగ్రామాన్ని - కంకర రోడ్లు, గ్యాస్ దీపాలు మొదలైన లక్షణాలతో - పునర్నిర్మించాలని ప్రయత్నిస్తున్నాడట! ఆనాటి సంస్కృతిని ధ్వంసం చేయడానికి దోహదం చేసిన తనే తిరిగి దానిని నిర్మించాలను కోవడం నిజంగా విచిత్రం. టెలిఫోన్లు, రిఫ్రిజరేటర్లు, మైక్రో వేవ్ వంట పాత్రలు, ఇవన్నీ ఇరుగు పొరుగులు పరస్పరం ఆధారపడి జీవించే విధానాన్ని అంతం చేస్తున్నాయి. ఆస్ట్రేలియాలోని అరాండా ఆదిమ జాతులలో ఒక మహిళ పొరుగింటి బిడ్డకు చనుబాలు కుడుపుతుండటం సర్వ సామాన్యమైన విషయం అని మనుష్య వర్తన శాస్త్రజ్ఞుడు జార్జ్ పీటర్ మర్డోక్ తెలియ జేశారు. నాగరిక సమాజాలలో, ముఖ్యంగా అమెరికా వంటి చోట పొరుగింటి నుండి ఒక కప్పు పంచదార అప్పుగా తెచ్చుకోడం జరుగదు. (ఈ అప్పు తీసుకోడం, తీర్చడం వలన వారితో పరిచయాలు, సంబంధాలు బల పడుతాయి కాని ఆ అవకాశం కూడా ఇప్పుడు ఉండదు)

ఆ నాటి సమాజాలలో ఆకలి దప్పులను, సామాజిక ప్రమాదాలను అందరూ కలిసి కట్టుగా ఎదిరించి, పరిష్కరించుకొన గలిగేవారు. కొన్ని సార్లు వారి కృషి విఫలం అయ్యేది. అయినా వారి మధ్య అందరం ఒకటేనన్న భావం దృఢంగా ఉండేది. అయితే ఈ నాటి సాంకేతిక పరిజ్ఞానం వలన లాభాలు లేకపోలేదు.

మనుష్యులను ఒంటరి వాళ్ళను చేస్తున్న సాంకేతిక పరిజ్ఞానంలో టెలివిజన్ అత్యంత ముఖ్యమైంది. ఇది వి.సి.ఆర్. కో, కేబుల్‌కో జత చేస్తే ఇక చెప్పనక్కరలేదు. ''ఎలెక్ట్రానిక్ టెక్నాలజీ వ్యక్తి తనకు నచ్చిన ఆనందం పూర్తిగా పొందడానికి తోడ్పడుతుంది. అయితే పురాతన వినోద కార్యక్రమాలతో ముడిపడి ఉన్న సామాజికత బలి అవుతుంది'' అని హార్వర్డ్ విశ్వ విద్యాలయం ప్రొఫెసర్ రాబర్ట్ పుట్నమ్ నిర్ధారించారు. వారానికి సగటున 28 గంటలు టెలివిజన్ చూస్తుంటే (అమెరికాలో అది సగటు) అంత కాలం సమాజానికి దూరంగా ఉంటున్నా రన్నమాటే గదా!

వ్యక్తిని గురించిన అభిప్రాయాలను కూడా టెలివిజన్ వక్రీకరిస్తుంది. సామాజికంగా ఆధిక్యత కొరకు ప్రయత్నించే మానవుడు ఆదిమ సమాజంలో తోటి వారితో పోల్చుకొని కనీసం ఏదో ఒక లక్ష్యంలో ఆధిక్యత ఉన్నట్లు నిరూపించు కొనేవాడు. కాని ఈ నాడు

మనం పోల్చుకొనేది టెలివిజన్‌లో చూస్తున్న ఊహాలోక వాసులతోనే! ''అలా పోల్చినప్పుడు మన పిల్లలు, తల్లిదండ్రులు, భార్యలు, భర్తలు అందరూ సాటి రాలేక పోతున్నారు. వారిని చూచి అసంతృప్తి చెందుతున్నాం. నిజానికి మనపై మనకు మన జీవన ప్రమాణంపై అసంతృప్తి కలుగుతున్నది'' అని జార్జ్ విలియమ్స్, రుడాల్ఫ్ (డ్రుస్సీ) అనే వైద్యులు 'వై వుయ్ గెట్ సిక్: ఏ న్యూసైన్స్ ఆఫ్ డార్వినియన్ మెడిసిన్' - (**Why we get sick - A new science of Darwinian Medicine**) అనే గ్రంథంలో పేర్కొన్నారు. అమెరికన్ నగరాలలో టెలివిజన్ ప్రసారాలు ప్రారంభించిన 1950 ప్రాంతంలో దొంగ తనాల రేటు ఒక్క సారిగా పెరిగిపోయింది.

మన సమాజం సామాజిక సంబంధాల పట్ల విముఖత చూపుతున్నదన్న మాట ఫ్రాయిడ్‌కు ఆశ్చర్యం కలిగించక మానదు. పశు ప్రవృత్తులకు, సామాజికావసరాలకు మధ్య పోరాటం పట్ల ఆయన బాధ వ్యక్తం చేశాడు. పరస్పరం సహకరించుకోవాలని, ఇరుగు పొరుగులను ప్రేమించాలని ఆయన మనకు ఉద్బోధించాడు. కాని మనం పొరుగు వారిని దోచుకు తింటానికి, వారిని బాధించడానికి, ఇబ్బందులు పెట్టడానికి, చివరకు అంతం చేయడానికి కూడా వెనుకాడము. ''మనిషి మనిషికి తోడేలు వంటివాడు'' అని ఆయన వర్ణించాడు. ప్రాచీన ఆటవిక మనస్తత్వాన్ని ప్రశంసిస్తూ ''మనం ఎవ్వరినీ ద్వేషించ కూడదని ఉన్నప్పటికి ప్రతివాడు ఎవరినో ఒకరిని, ఏదో ఒక సందర్భంలో ద్వేషిస్తూనే ఉన్నాడు'' యిది యీనాడు జరుగుచున్న సత్యము. మానవుని సహజ లక్షణాలపై ప్రతి బంధకాలను విధించడం విపరీతంగా సామాజిక బంధాలను ఏర్పరచుకున్నవారు చేసిన పని అని యూనా బాంబర్ అభిప్రాయం. ఆది మానవునకు స్వతః సిద్ధమైన లక్షణాలపై ఎటువంటి ప్రతి బంధకాలు లేవన్న ఫ్రాయిడ్ అభిప్రాయంతో అతడు ఏకీభవించినట్లు కన్పిస్తూంది.

కాని మనో వికాస విజ్ఞానం ప్రకారం స్వత స్సిద్ధమైన మానవ ప్రవృత్తిపై ఎన్నో ప్రతి బంధకాలున్నట్లు స్పష్టమవుతున్నది. ద్వేషం అన్నది మన సహజ సిద్ధమైన లక్షణం అలాగే ఈ సమాజ భావాలపై అదుపు ఉండటం కూడా మానవ సహజ సిద్ధమైన లక్షణమే. తప్పు చేశామన్న భావం, ఈ విధమైన అదుపు చర్యలలో ఒక భాగం. మన బంధు వర్గాన్ని విస్మరించకుండా ఇది నిరోధిస్తుంది. కోపం ఎక్కువై మిత్రత్వాలను భంగ పరచడానికి కూడా ఇది అడ్డు వస్తుంది. కోపం చల్లారిన తర్వాత తన తప్పుకు క్షమాపణ చెప్పుకోడానికి తోడ్పడుతుంది. కోపంలో ఎవరినైనా దూషిస్తే ఆదిమ సమాజాలలో త్వరలోనే దానిని మర్చిపోయి పొరపాట్లు సరిదిద్దు కొనేవారు కాని మనం కొన్ని వారాల దాకా వారిని కలవం. వారి ముఖం చూడం. ఆగ్రహం అనేది ఆధునిక నాగరికత తెచ్చిన వైపరీత్యం కాదు.

జీవ కణాలకు సహజ సిద్ధమైన స్వప్రయోజనాపేక్ష ఒక రకంగా చూస్తే స్వార్థం అనడానికి వీలు లేదు. ప్రేమ, కరుణ, ద్వేషం, మైత్రి, అపనమ్మకం, నమ్మకం మొదలైన వన్నీ మనకు జీవ కణాల ద్వారా సంక్రమించిన లక్షణాలే. ఆధునిక సమాజ ధోరణులు వీటిని అడ్డుకొని, అదుపు చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. ముఖ్యంగా పశు ప్రవృత్తి పరమైన భావాలకు కళ్లెం వేయడం జరుగుతూంది. ఆధునిక జీవితంతో వచ్చిన చిక్కు మనం సామాజిక సంబంధాలను ఎక్కువగా ప్రోత్సహిస్తున్నామనే కంటె, చాలా తక్కువగావడమే ననవచ్చు. కాని మన సామాజిక సంబంధాలలో అతి తక్కువ భాగమే నిజమైన ఆత్మీయతతో కూడుకున్నది.

మన ఆధునిక సంస్కృతిలో నాగరకత లోపించడం ఒక నిజమైన లక్షణం. కనుకనే అమెరికాలో ప్రధాన పక్షాలైన డెమక్రాట్, రిపబ్లికన్ నాయకులు కొత్త కమ్యూనిటేరియన్ ఉద్యమాన్ని ప్రోత్సహిస్తున్నారు. ప్రజలలో సామాజిక బంధాలను తద్వారా నైతిక బాధ్యతలను పెంపొందించడం దీని లక్ష్యం. ఒకనాడు అమెరికా సాంఘిక జీవితాన్ని సుసంపన్నంచేసిన బాయ్‌స్కౌట్, రోటరీ క్లబ్ వంటి సంస్థలు ఈనాడు శిథిలమైపోవడం దుర దృష్ట కరమని అమెరికాలోని మేధావులు, రాజకీయ నాయకులు భావిస్తున్నారు.

ఆధునిక జీవితంలో కనుమరుగైన ముఖ్య లక్షణాలలో ఒకటైన ''విశ్వాసం'' గురించి ఫ్రాన్సిస్ ఫుకుయామా తమ గ్రంథం 'ట్రస్ట్'లో వివరించారు. 1960లో అమెరికన్‌ల లో 58% మంది 'చాలా మందిని విశ్వసించవచ్చు'ననే భావంతో ఉండగా, 1993 నాటికి ఇది 37%కి పడిపోయింది మానవ మేధస్సు పరస్పర విశ్వాసంతో కూడిన సంబంధాలు ఏర్పరచుకొనే విధంగా రూపొందింపబడింది, ఇటువంటి సంబంధాలు లోపిస్తే మనిషి మానసికంగా ఎంతో బాధ పడిపోతాడు. అయితే ఆధునిక సాంకేతిక ప్రాధాన్యం గల ఆర్థిక వ్యవస్థలో మన తీరిక సమయంలో అధిక భాగం జనులు 'ఎలెక్ట్రానిక్స్ వాతావరణం'లో గడుపుతూ, సామాజికంగా మైత్రీ సంబంధాలకు బదులు వృత్తిపరమైన సంకుచిత సంబంధాలకు ప్రాధాన్య మిస్తున్నారంటే ఆశ్చర్యం లేదు.

'సంఘ జీవితా'న్ని, 'సమాజాన్ని' పునరుద్ధరించడానికి కృషిచేస్తున్న వారంతా వికాస మేధో విజ్ఞానం ఉపయోగించి లాభం పొందవచ్చు. ఉదాహరణకు చిన్న పిల్లల పోషణ వ్యవస్థలో ఉన్న లోపాలను ప్రస్తావిస్తూ తల్లిదండ్రులు సహకరించుకోవాలని, డేకేర్ సెంటర్లలో తల్లి దండ్రులు రోజూ కొంత సమయం గడపడం అవసరమని సంఘ వ్యవస్థ పునరుద్ధరణ ఉద్యమ నాయకులు అమితాయ్ ఎట్జియోని సూచించారు. 'ది స్పిరిట్ ఆఫ్ కమ్యూనిటీ' అనే గ్రంథంలో ఈ విషయం ప్రస్తావిస్తూ పసి పిల్లలు ఇంటి దగ్గరే సంతోషంగా ఉంటారని, అయితే ఇటు ఇల్లు చూసుకుంటూ అటు ఉద్యోగం చేసుకొనే మహిళలకు, ఉద్యోగ స్థలాలలోనే పిల్లల సంరక్షణ కేంద్రం ఉండటం లాభ దాయకమని పేర్కొన్నారు.

మరో వైపు వసతి వాడల నిర్మాణ పథకాలు రూపొందించడంలో, మానవ నైజాన్ని కూడా పరిగణనలోకి తీసుకోడం ప్రారంభమైంది. పరస్పర మైత్రీ సంబంధాలు పెంపొందించడంలో సహాయ పడే సామాజిక క్రీడాంగణాలు, వినోద కార్యక్రమాలు, కార్లు నిలుపుకోడానికి విశాలమైన స్థలాలు (కారు నుండి నేరుగా ఇంటిలోకి వెళ్ళడానికి వీలు లేకుండా) ఫుట్‌పాత్‌లు' వాటి ప్రక్కగా పచ్చిక బాటలు - ఏర్పాటు చేస్తున్నారు. వీలైనంత ఎక్కువ మందితో తప్పనిసరిగా కలుసుకొనే అవసరం, అవకాశం కలిగించడం దీని ఉద్దేశ్యం.

అయితే మానవ సంబంధాలలో రావలసిన మౌలికమైన మార్పులు సిమెంటు ఇళ్లు, దగ్గర దగ్గరగా నిర్మించినంత మాత్రాన సాధ్యపడదు. ఉద్యోగ రీత్యా ఇంటికి మైళ్ళ దూరంలో ఉండి పోవాలి. టెలికమ్యూనికేషన్ సౌకర్యాలు అధికమైనప్పటికీ, ఆఫీసు పని చేసుకోకలుగుతాడే కాని, పది అడుగుల దూరంలోనే ఉన్న పొరుగు వారితో ముఖా ముఖి వ్యక్తిగతమైన మైత్రీ సంబంధాలు మాత్రం నెలకొనవు బలపడవు. మన పూర్వీకులకు, మనకు ఇదే తేడా వీటన్నిటికి పెట్టుబడిదారీ విధానం మూలం. ఉద్యోగాల పేరుతో గ్రామీణ యువతను పట్టణాలకు ఆకర్షించడం వలన కుటుంబ, సమాజ వ్యవస్థ ఛిన్నా భిన్నమైపోయింది. ఈ పరిశ్రమలు రక రకాల వస్తు సామగ్రులను

ఎడా పెడా తయారు చేసి జనం మీదకు విసురుతుండటంతో సంఘ వ్యవస్థ విచ్ఛిత్తికి మరింత బలం చేకూరింది స్వేచ్ఛా వాణిజ్య ఆర్థిక వ్యవస్థకు, కుటుంబ విలువలకు మధ్య వైరుధ్యం ఏర్పడింది సాంప్రదాయికమైన విలువలు అంతరించి పోతున్నాయని వాపోయే మిత వాదులే, వాటిని ధ్వంసం చేస్తున్న సాంకేతికాభివృద్ధిని, అటువంటి ఆర్థిక వ్యవస్థను ఎంతో ఉత్సాహంతో సమర్థిస్తున్నారని యూనా బాంబర్ విమర్శించాడు.

పెట్టుబడి దారీ విధానానికి ప్రత్యామ్నాయం ఏదీ కన్పించడం లేదు ఆధునికతలోని సామాజిక వ్యతిరేక ప్రభావాలను తగ్గించగల కొద్దిపాటి ప్రయత్నాలు కూడా ఆచరణ సాధ్యంగా లేవు ఉద్యోగం చేసుకొనే చోట పిల్లల సంరక్షణ కేంద్రాలు నెలకొల్పాలంటే ఎంతో ఖర్చుతో కూడిన పని విశాలమైన పబ్లిక్ పార్కులు ఏర్పాటు చేయాలన్నా డబ్బు కావాలి ప్రయివేటు పాఠశాలల నుండి విద్యార్థులను మంచి పబ్లిక్ పాఠశాలలకు మళ్లించడమూ ఖర్చుతో కూడినదే పబ్లిక్ పాఠశాలలలో పిల్లల మధ్య సోదర భావం బలపడుతుంది వీటికై పన్నులు పెంచితే ఆర్థిక ప్రగతి కుంటు పడుతుంది. అయితే సంఘ వ్యవస్థ బలపడుతుందనుకున్నప్పుడు ఆర్థిక ప్రగతి కొంత మందగిస్తే నష్ట మేమిటి? అని న్యూట్ గింగ్రిచ్ మొదలైన రాజకీయవేత్తలు ప్రశ్నిస్తున్నారు. పైగా మన పొరుగు వారు మనకంటె ఒక్కసారిగా భాగ్యవంతులు కానప్పుడు, టెలివిజన్‌లో మనకు కన్పించే ప్రజలూ మనకంటె గొప్పగా లేనప్పుడు మనం మాత్రం ఎందుకు బాధపడాలి ? మనం వారితోనే గదా పోల్చుకొనేది! 1957-1990 మధ్య కాలంలో అమెరికాలో తలసరి ఆదాయం రెట్టింపు అయినా, 'సుఖంగా ఉన్నామ'ని చెప్పుకొనేవారు, అప్పుడూ, ఇప్పుడూ జనాభాలో స్థిరంగా మూడోవంతు మాత్రమే ఉన్నారు. ఆదాయం పెరుగుదల మన కీలకావసరాలు తీర్చుకోడానికి సాధ్యం కానప్పుడు, ఆర్థిక ప్రగతి పేద, ధనిక వర్గాల మధ్య అంతరాన్ని పెంచుతుంది.

విధాన నిర్ణేతలే కాదు, మనందరం గుర్తించ వలసిన గుణపాఠం ఒకటి ఉంది. ''ఉన్న దానికంటె ఇంకొంచెం ఎక్కువ కావాలని కోరే తత్వం మానవ మేధ'' అని మనో వైజ్ఞానిక వేత్త తిమోతీ మిల్లర్ వ్రాశారు. ''మానవులు తాము కోరుకొనే వన్నీ ఉన్నాయని నిజంగానే భావిస్తూఉంటారు ఉన్నదాని కంటె ఇంకొంచెం లభిస్తే వారి ఆనందానికి అవధు లుండవు. వారు తృప్తి చెందుతారు''. ఇది మన నైజంలో నిబిడీకృతమై ఉన్న ఆభాస.

అంటే మనం నిరంతరం తాపత్రయపడడానికి ఈ ఆభాస కారణం. మన వంశం వృద్ధి చెందుతుందన్న ఆశ కొద్దీ మరికొంత సంపాదించాలన్న ప్రయత్నం. కాని మన పూర్వీకులకంటె భిన్నంగా ఈ నాడు పరిమిత కుటుంబాల సిద్ధాంతం పాటిస్తూఉండటంతో, భౌతికమైన సుఖ భోగ భాగ్యాలకు ప్రాధాన్యం తగ్గింది. సహజమైన మన ఎంపిక - విధానం - నిజంగానే మంచిది కావచ్చు, కాకపోవచ్చు. అయితే ఈ ఎంపిక - మన నిర్ణయం మన వైఖరికి సృష్టికర్త అనవచ్చు. ఇది మన మనస్సులో నాటిన భావాలను ప్రతిఘటించడం పూర్తిగ సాధ్యం కాకపోవచ్చు.

ఇంకా ఎక్కువ పొందాలన్న నిష్ఫలమైన తపన, నిరంతర పోరాటం - వారానికి 60 గంటల పని, భాగ్యవంతుల కొరకైన వస్తువుల కేటలాగులు శ్రద్ధగా చూడటం, మొదలైనవి డార్విన్ పేర్కొన్న 'సోషల్ ఇన్‌స్టింక్ట్స్' ఫలితమే. ఇంకా ఎక్కువ అనే లక్ష్యం వెంట బడితే, మన పొరుగు వారిని గురించి తెలుసుకొనడానికి, వారితో సంబంధాలు పెంచుకొనడానికి అవకాశమే ఉండదు మన వారినే ఎక్కువగా ప్రేమించడానికి మానవ సహజమైన ప్రేమాభిమానాలను పెంపొందించు కొనడానికి సమయమే ఉండదు. ఈ మానవ లక్షణాల లోతులను పరిశీలించడానికి విజ్ఞాన శాస్త్రం ప్రయత్నిస్తున్నది.

✲

# శూన్యము

- కొండిపర్తి శేషగిరిరావు

ఈ విశ్వానికి మును ముందుగా కారణ భూతంగా ఉన్నదేమిటి అనే దానిని గురించి ఆలోచిస్తూ, దానిని అన్వేషణలతో పట్టుకోవాలని ప్రయత్నించే జిజ్ఞాసువులకు అందేవి, చైతన్యం పదార్థం పరిణామం మొదలైనవి.

వీటిలో చైతన్యం అస్తిత్వాన్నీ, దాని అనాదిత్వాన్నీ, అఖండత్వాన్నీ అంగీకరిస్తున్నాయి కొన్ని ఆలోచనలు.

మరి కొన్ని మేథస్సులు పదార్థ అస్తిత్వాన్నీ, దాని అనాదిత్వాన్నీ దాని అనంత తత్వాన్నీ ఆమోదిస్తున్నాయి.

ఇంకొన్ని అన్వేషణలు పరిణామాన్ని ఆధార మూలంగా చూపిస్తూ, దాని యొక్క సర్వ వ్యాప్తతనూ, నిత్య నూతనత్వాన్నీ వ్యక్త పరుస్తున్నాయి.

ఇలా ఎన్నో ఆలోచనా ధోరణులు, ఎన్నో అన్వేషణలను చూపిస్తూ, అవి ఒక దాని కొకటి, కొన్ని సందర్భాలలో ఆత్మీయంగా మాట్లాడుకొంటూ - మరికొన్ని సందర్భాలలో సంఘర్షించు కొంటున్నాయి.

పదార్థము, పరిణామము, చైతన్యము అన్న వాటిల్లో ఏ రెండు మూలకాలైనా కాదని, మిగిలిన ఒక దానిని అస్తిత్వంగా, అనాదిత్వంగా ప్రతిపాదిస్తూ పోతుంటే, దాని యొక్క ఉనికికి ఉనికినిస్తున్నదీ, దాని అస్తిత్వానికి అవకాశాన్ని ఇస్తున్నదీ, దానికి కారణ భూతమైనది ఏదైనా ఉన్నదా అని పరిశీలించి నపుడు, ఆ మూల ధాతువు స్వయంభువు అని అనక తప్పటం లేదు. మొదట ఆ స్వయంభువత్వాన్ని అంగీకరించినా, ఆ తరువాత అది అంత సమర్థ వంతమైన సమాధానంగా అనిపించదు చురుకు గల అన్వేషణకు.

అందుకని ఏదో ఒకటి, పదార్థంగానీ, చైతన్యంగానీ లేక పరిణామంగానీ, ఇంకా మరొకటి ఏదైనా ఉన్నది అన్నపుడు అది స్థూలమైన లేక సూక్ష్మమైన కొంత భావాన్ని గుణ రూపంలో కలిగి ఉంటుంది. ఆ భావానికి, లేక ఆ గుణానికి ఓ అవకాశాన్ని ఇవ్వటానికి ఆకాశ తత్వపు ఉనికి కావాలి. ఆ అవకాశ ఆకాశపు ఉనికికి కూడా, ఓ ఉనికి కావాలన్నా; లేక వీటన్నిటినీ విచారణ చేసే జిజ్ఞాసలోని జ్ఞానానికి ఉనికి కావాలన్నా అందుకు పూర్తి అస్తిత్వాన్ని సమకూర్చేది 'శూన్యము'. ఎందుకని అంటే, మానవునిలోని జిజ్ఞాస, అందులో ఉండే జ్ఞానమూ శూన్యములో చోటు చేసుకొంటున్నవి కనుక శూన్యము, జ్ఞానము ఆకాశ తత్వములకన్నా చాలా సూక్ష్మాతి సూక్ష్మము. దాని అస్తిత్వం మీదే ఆకాశపు ఉనికి కూడా ఆధారపడి ఉన్నది. ఆకాశ తత్వములో ఓ వస్తువు (అది స్థూలము కావచ్చు సూక్ష్మము కావచ్చు.) కొంతను ఆక్రమించినప్పుడు, ఆక్రమించిన ఆ కొంత ఆకాశ తత్వం ప్రక్కకు జరగటానికి అక్కడ కొంత శూన్యత ఉండాలి. అందుకనే ఆకాశ తత్వానికి ఉనికినిచ్చేది కూడా శూన్యము ఔతోంది. అంతే కాదు, ఇది స్వయంభూ తత్వంలోగల చర్యకు కూడా అస్తిత్వాన్నిస్తున్నది. కనుక ఈ విశ్వంలోని కారణ

మూలాలకు, వాటి అనాదిత్వానికీ ఆధారమునూ అవకాశమునూ ఇస్తున్నది 'శూన్యము'. కనుక ఈ విశ్వము అనాదిత్వము శూన్యము అనటం అంత అసమంజసం కాదేమో. అది ఒకానొక ధాతువు మాతువు. ఈ శూన్యం కోసమే యోగ సమాధి స్థితి. ఐతే శూన్యం అంటే అక్కడ ఏమీ ఉండదు అనే సాధారణాభిప్రాయం ఉన్నది. కాదు అనే అభిప్రాయమూ ఉన్నది. శూన్యము అన్న అంశ లేకపోతే అది అన్నిటి యొక్క అస్తిత్వములను తుడిచి వేస్తుంది. అందుకనే శూన్యం కాదు అస్తిత్వం యొక్క మూలము అనాదిత్వము అనే గతంలోని ఆలోచనా ధోరణులు కూడా ఉన్నాయి. శూన్యాన్ని అంగీకరించలేక.

కానీ, పదార్థ , పరిణామ, చైతన్య, క్రియాత్మక మొదలైన అన్ని రెమ్మలలోనూ కొంతగానైనా ప్రయాణించి జీవించిన తరువాత మన జిజ్ఞాసనూ అన్వేషణలనూ తీవ్ర తరం చేస్తే అక్కడ శక్తివంతంగా స్వయం భువత్వం అనే సమాధానాన్ని కూడా దాటి ముందుకు జిజ్ఞాసువును తీసుకు పోయే అంశ 'శూన్యం' అన్నది ఔతున్నది. ఇది ఆకాశ తత్వం కన్నా ఎంతో సూక్ష్మం. దానికి అనాదిలోనూ, తరువాతా అనువునూ అస్తిత్వాన్ని ఇచ్చేది శూన్యం.

ఇది ఇంత వరకూ తాత్విక జగత్తు తేల్చిన విశ్వం యొక్క మూల కారణపు అంశాలన్నిటికీ ఉనికినిచ్చేది. పైగా ఇది పదార్థంగా, చైతన్యంగా, పరిణామంగా ఇంకా తత్వ చింతన తేల్చిన మూల ధాతువులకు భూమికగా కూడా అవుతుందనిపిస్తుంది.

కనుక ఈ శూన్యం నుండి మానవునిలోనీ తాత్విక జగత్తులోనీ జిజ్ఞాసా అందలి జ్ఞానమూ ఆవిష్కరింప బడుతున్నాయి, ఉనికిని పొందుతున్నాయి, నిష్క్రమిస్తున్నాయి. కనుక స్థూల సూక్ష్మ, జిజ్ఞాసా జగత్తుల ఉనికికి ఓ విశ్వ కీలక మాధ్యమం, జిజ్ఞాసలోని చివరి ఫలం 'శూన్యం' అని అనిపిస్తుంది - ఇంత వరకు జిజ్ఞాస వేసిన చిరు తప్పటడుగులలో

## ON CASTE

But how, he asked himself angrily, does a Brahmin or a Reddy or a Yadav or a Jatav or any other caste-labelled bastard know that his mother had not slept with a stud-bull of another caste and begotten him, complete with caste seal and label? How can anyone assert that this nation, or any nation for that matter, is not composed of a vast number of un-identified bastards? Unidentified because their mothers are married? Why should that piece of thread called mangalsutra or a wedding ring or any other external distinctive mark make such a whale of a difference? Why? Why? And here he was Ramchander Nothing, yet a blazing success story if ever there was one. We have seen the caste factor, which was a social phenomenon for ages become all pervasive in...elections.

**Sri P.V. Narasimha Rao**
*Prime Minister of India.*

# హైకూ అంటే చంద్రుణ్ణి చూపించే వేలు !

చంద్రుణ్ణి చూపించాక వేలు అవసరంలేదు. ఏరు దాటాక తెప్ప అవసరంలేదు. తనని తాను రద్దు చేసుకుని, తను అదృశ్యమైపోయి, స్వతస్సిద్ధ వస్తు తత్వాన్ని (Thing-in-itself) ఆవిష్కరించటం హైకూ అనే కవితా ప్రక్రియ ప్రత్యేక లక్షణం ఇదే దీన్ని మిగతా కవితా ప్రక్రియల్నించి వేరుచేస్తుంది

ప్రాకృతికవస్తువులతో మన మౌలికమైన ఐక్యాన్ని సిద్ధింప చేసుకునే అనుభవాన్నే 'జెన్' లేదా 'హైకూ అనుభవం' అంటారు. వస్తువు మనలో తన్ను తాను చూసుకుంటుంది మనం వస్తువులో మన నీడని చూసుకుంటాం. విషయికీ (Subject) విషయానికీ (Object) మధ్య సరిహద్దు చెరిగిపోతుంది. కవి ప్రకృతితో తాదాత్మ్యాన్ని సిద్ధించుకుంటాడు, విశ్వంతో తాదాత్మ్యాన్ని సాధించినప్పుడే మనకు ఆత్మజ్ఞానం కలుగుతుంది.

నిజమైన కవిత్వానుభవంలో ఆత్మ, పర భేదాలు లయిస్తాయి. అనుభవించే మనస్సూ, అనుభవింపబడే వస్తువూ, వేరువేరు కాదు. రెండూ కలిసి ఒకే అనుభవం. ఇది అంతర్జ్ఞాన సంబంధమైంది (intuitive). హేతుబుద్ధికి (reason) సంబంధించింది కాదు. అనుభూతి పరమైంది తార్కికమైన ఆలోచనలతో దీనికి సంబంధంలేదు. ప్రతి వస్తువుకీ దాని సారభూతమైన అస్తిత్వం ఉంటుంది. మన అస్తిత్వాన్ని దానితో ఐక్యం చేసినప్పుడే దాన్ని తెలుసుకోగలం ఇది బుద్ధితో కాని, తర్కంతో కాని కలుషితం కాని ప్రత్యక్ష అనుభవం ద్వారానే సాధ్యం మనస్సూ, వస్తువూ ఐక్యం సాధించగలిగే ఈ అనుభవాన్ని జపానీయ బౌద్ధులు 'జెన్' అన్నారు. 'జెన్' అనగా ధ్యానం ఈ అనుభవం ఆత్మాశ్రయమూ (Subjective) కాదు, వస్త్వాశ్రయమూ (Objective) కాదు ఏకకాలమందు రెండూనూ నిజానికి కవిత్వానుభవమంటే ఆవశ్యకంగా ఇదే విషయీ, విషయ భేదాలు చెరిగిపోయినప్పుడే కవిత్వం ఉద్భవిస్తుంది. కాసిరెర్ (Cassirer), డ్యూయీ (Dewey), పౌండ్ (Pound), ఇలియట్ (Eliot), లాంజర్ (Langer) వంటి ఇటీవలి పాశ్చాత్య సౌందర్యవాద తాత్త్వికులు (aesthetic Philosophers) ఈ పర్యవసానానికే వచ్చారు.

ఐతే, ఈ కవిత్వానుభవం వివరణ ద్వారాకాని, ఆలోచన ద్వారాకాని, అలంకారాల ద్వారా కాని, ప్రవచనాల ద్వారా కానీ అభివ్యక్తీకరించబడదు దీనికి పదచిత్రం (image) ఒక్కటే సాధనం ఆ ప్రత్యేక కవిత్వానుభూతితో స్పందించే పదచిత్ర మొక్కటే ఈ హైకూ అనుభవాన్ని పట్టివ్వగలదు.

పదచిత్ర మనేది ఐంద్రియకం (sensuous). ఇంద్రియ జ్ఞానాన్ని ప్రేరేపిస్తుంది. హేతుబుద్ధికి సంబంధించింది కాదు లోతైన అనుభూతుల్నీ (feelings), భావాల్నీ (emotions) ఆవాహించే శక్తి పదచిత్రానికుంది కవిత్వానుభవాన్ని పదచిత్రాలు స్ఫురింపచేసినట్లు బౌద్ధికమైన ఆలోచనలు స్ఫురింపచెయ్యలేవు కనక, హైకూ ప్రాణం పదచిత్రంలో ప్రతిష్ఠితమై ఉంటుంది మూర్తమూ (Concrete), ఇంద్రియ గ్రాహ్యమూ ఐన పదచిత్రం ఏ విధమైన వివరణ సహాయం లేకుండా హైకూలో భాసిస్తుంది

ఉదాహరణకి, హైకూ కవితా పితామహుడు, 17వ శతాబ్దంలో జీవించిన జపానీయ కవి 'బషో' ప్రసిద్ధ హైకూ

ఎండిపోయిన కొమ్మమీద
కాకి ఒంటరిగా కూచుంది.
చలికాలపు సాయంత్రం

ఈ పదచిత్రంలో ఇచ్చిన మూడు వస్తువులూ - ఎండిపోయిన కొమ్మా, ఏకాకి కాకీ, చలికాలపు సాయంకాలమూ - ఒకే రకమైన అనుభూతిని ప్రసరిస్తున్నాయి. ఈ మూడింటినించి సమానంగా ఉబికే అనుభూతి ద్వారానే ఆ హైకూలోని చలికాలం సాయంత్రపు ఒంటరితనపు దిగులుని అనుభూతించ గలుగుతున్నాం. ఇది వేరేవిధంగా, అంటే వట్టి బౌద్ధిక ప్రక్రియల ద్వారా సాధ్యంకాదు. ఇది ప్రత్యక్ష ఐంద్రియక అనుభూతి. ఇది ఆత్మాశ్రయం కాదు. మనస్సూ, వస్తువూ, రెంటికలయికవల్ల ఉద్భూతమైంది. విశ్వ హృదయంలో ప్రవేశించి, దానిలో ఐక్యమవటమంటే ఇదే.

హైకూలో మనకు కనిపించేవి ప్రత్యేక ప్రాకృతిక దృశ్యాలైనా, వాటి ద్వారా మనం సార్వత్రిక భావాల్ని అందుకోగలుగుతున్నాం. ప్రతి విశేష (Paticular) వస్తువు వెనకా సార్వత్రిక (Universal) సత్యం దాగివుంటుంది. విశేష, సార్వత్రికాల సమ్మేళనమే హైకూ. విశేష అనుభవాల నించి సార్వత్రిక సత్యాలకు చేరవేస్తుంది.

ఆత్మ, ప్రకృతుల కలయిక వల్ల సాధించే ఇటువంటి దర్శనాన్ని అభివ్యక్తం చెయ్యటానికి హైకూ యే సరైన రూపమని అభిజ్ఞుల అభిప్రాయం. హైకూ అనుభవం వంటి ఆత్మిక అవిష్కృతి కొన్ని క్షణాలకన్నా ఎక్కువసేపు నిలవదు. దాని అభివ్యక్తికి మూడు పాదాల హైకూ సరిపోతుంది.

17 వర్ణాల నియమం తెలుగులో పాటించడం అసాధ్యం. జపానీయ భాషలో ఏక వర్ణ పదాలెక్కువ. తెలుగులో బహువర్ణ పదాలు జాస్తి కనక, జపానీయ భాషను అనుకరించటం తెలివి తక్కువ.

బషో చెప్పినట్టు 'వెదురుచెట్టు గురించి తెలుసుకోవాలంటే, నీ మనస్సునీ, ఆలోచనల్నీ త్యజించి, వెదురులోకి ప్రవేశించు' ఇది హైకూ మార్గం

## II

నిజంగా హైకూ అనేది పద్యంకాదు, సాహిత్య ప్రక్రియే కాదు. అది సైగ చేస్తున్న చెయ్యి; సగం తెరిచిన ద్వారం; శుభ్రంగా తెరిచిపెట్టిన అద్దం. ప్రకృతికి తిరిగివెళ్లే మార్గం. మన సహజ తత్త్వానికి తిరిగి వెళ్లే మార్గం. మన పుష్పతత్త్వానికీ, చంద్రతత్త్వానికీ, వర్ణతత్త్వానికీ, జలతత్త్వానికీ, ఆకాశ తత్త్వానికీ, ఒక్క మాటలో చెప్పాలంటే, మన బుద్ధి తత్త్వానికి తిరిగి వెళ్లే మార్గం.

'జెన్' అనే పదాన్ని రెండర్థాలలో ఉపయోగిస్తుంటారు 1. ప్రాకృతిక వస్తువులతో ఐక్యమౌతూనే మన వ్యక్తిత్వాన్ని నిలుపుకునే మనఃస్థితి. 2. బౌద్ధ తాత్త్వికుడైన బోధిధర్ముడు (క్రీ.శ. 470-534) మహాయాన సిద్ధాంతాలను నిత్య జీవితానికి అన్వయించిన పద్ధతి.

నిజానికి జెన్ అనేది ఒక జీవిత పద్ధతి. మన నిత్య జీవితంలో ప్రతి ఆచరణలో ప్రతి క్షణమూ అనుసరించదగ్గది ఈ తాత్త్వికవైఖరి జపాన్ జాతి జీవనంలోనే గొప్ప మార్పు తీసుకువచ్చింది. ఒక మహత్తరమైన సంస్కృతిని సృష్టించింది. సామాన్య జనం మనస్తత్వాన్ని కూడా సున్నితపరిచింది. ఒక జాతి జాతినీ సౌందర్యారాధకులుగా మలిచింది.

పట్టి ఒక విషయం సులువుగా బోధపడుతుంది. ఎవరుపడితే వారు హైకూ రాయలేరు. దానికి ఒక విధమైన మానసిక వైఖరి కావాలి ప్రకృతి యెడల అపారమైన ప్రేమా, అంతర్ముఖత్వమూ, రెండూ ఏకకాలీనమందు అవసరం. ప్రాపంచిక లంపటాలయందు విముఖత్వమూ, ప్రశాంతమైన మనఃస్థితీ, సుకుమారమైన అనుభూతీ, ప్రపంచం నశ్వరమనే అవగాహనా, దాని నుంచి ఉబికిన జాలీ - ఇటువంటి మానసిక లక్షణాలున్నవారు కాని హైకూ రాయలేరు

వర్షం - క్షణం పూచే నీటి పూలతో - ఊరునిండి పోయింది

అనటంలో చేతనా సౌకుమార్యమూ, సౌందర్యం క్షణికమనే అవగాహనా, దీన్నించి పుట్టిన ఒక విషాదమూ స్ఫురిస్తాయి. సుకుమారమైన అనుభూతిని జెన్ రసజ్ఞులు 'మియాబి' అంటారు. సౌందర్యపు క్షణికత్వాన్ని తెలుసుకున్నప్పుడు కలిగే దిగులుని 'అవారే' అంటారు.

గోడలో పూచిన పూవు
పరిచయం చేసింది
మా గోడను.

ఇంతకాలం ఉపేక్షించిన గోడని ఆకస్మికమైన, క్షణికమైన పూవు పరిచయం చేసింది. హైకూ లాగే! కవిత్వానుభూతీ, పదచిత్రాల సమన్వయం ఇక్కడ మీరు గమనిస్తారు. ద్రష్టా, దృశ్యమూ, అనుభూతీ ఏకత సాధించాయి.

పూవూ లేదు
నేనూ లేను
సౌందర్యం ఆవరించింది.

ఇదే 'జెన్ సమాధి'!

ఎప్పుడూ విస్మయంతో
పూలని నేనూ
నన్ను పూలూ

ద్రష్టకీ, దృశ్యానికీ తేడా యేమిటి?

వాన వెలిసింది
తీగపై
చిన్ని ప్రపంచాలు వేలాడుతున్నాయి.

ఒక జెన్‌కో అన్ (ప్రహేళిక) ఉంది. శిష్యుడు గురువుగారిని ప్రశ్నించాడు. 'స్వామీ, తమరింత స్పష్టంగా ఎలా చూడగలుగుతున్నారు'? సమాధానం: 'కళ్లు మూసుకున్నాను కనక'.

బైట కళ్లు మూసుకుని, లోని కళ్లు తెరిస్తే కాని హైకూ రాయలేరు.

– ఇస్మాయిల్

# కులము - ప్రత్యామ్నాయ సంస్కృతి

సమీక్షకుడు : ఆంజనేయులు                    గ్రంధకర్త : కత్తి పద్మారావు

"Caste and Alternative Culture" అనే ఈ పుస్తకం కత్తి పద్మారావుగారు తెలుగులో రాసిన 'కులం - ప్రత్యామ్నాయ సంస్కృతి' అనే పుస్తకానికి ఆంగ్ల తర్జుమా. దాని అనువాదకుణ్ణి నేనే కాబట్టి దీని సమీక్షగానీ, పరిచయం కాని నేను కాక మరెవరయినా చేస్తే బాగుండునని నేను భావించాను. దాని వలన ఆ సమీక్షకునికి ఈ పుస్తకాన్ని చదివే అవకాశం లభించేది.

అయితే డాక్టర్ దేవ సహాయంగారి కోరిక మేరకు ఈ బాధ్యత కూడా నేనే నిర్వర్తించాల్సి వచ్చింది. నాకు చేతనైనంత వరకూ ఆ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించే ప్రయత్నం చేస్తాను.

డాక్టర్ రాజారత్నంగారు తమ ముందు మాటలో చెప్పినట్లుగా కులం హిందూ సమాజానికి కేంద్ర బిందువయింది. ఒక వికృతమైన తర్క బలంతో 'కులం' ధర్మంగానూ, కుల రహిత సమాజం అధర్మంగానూ చలామణీ అయింది.

ఈ దేశంలో కులాన్ని నిర్మూలించి ఒక ప్రత్యామ్నాయ సంస్కృతిని ఏర్పర్చాలనే ఉద్దేశ్యంతో ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న దళిత మేధావి శ్రీ కత్తి పద్మారావుగారు ఈ పుస్తకం భారత సమాజంపైన ఒక ఉత్తేజకరమైన ప్రభావం వేసి సమాజాన్ని ఒక ఊపు ఊపుతుందని విశ్వసిస్తున్నారు.

ఈ పుస్తక రచన ఎంతో పకడ్బందీగా సాగింది. చెప్పదలచుకున్న ప్రాథమికమైన వాదం ఎంతో హేతుబద్ధంగా వుంది. ఈ గ్రంథంలో పన్నెండు అధ్యాయాలున్నాయి. 1) కులం దొంతరులు 2) భూస్వామ్య కులాల ఆధిపత్యం 3) అగ్రకులాల వారి కుల తత్వ ఉద్యమాలు 4) కుల నిర్మూలన ఒక ఆశయం 5) కుల వ్యతిరేక తాత్త్విక పోరాటాలు 6) రామాయణం - ఆర్యుల ఆధిపత్యం 7) బౌద్ధ సంస్కృతి హిందూ మతానికి ఒక ప్రత్యామ్నాయం 8) గుప్తుల కుల రాజ్యం 9) భక్తి ఉద్యమాలు 10) దళిత పాంథర్స్ - ఒక సాంస్కృతిక ఉద్యమం 11) పెరియార్ ఇ.వి. రామస్వామి నాయకర్ 12) దళిత ఉద్యమం తాత్విక నేపథ్యం.

రచయిత ఈ గ్రంథాన్ని కూర్చడానికి విస్తృతమైన అధ్యయనం చేసి సమాచారాన్ని సేకరించారు. కులం పునాదులను పట్టుకొని దాన్ని విమర్శనాత్మకంగా వివరించడానికి హిందూ మత గ్రంథాలను అధ్యయనం చేసి కులానికి దైవానుమతీ, సామాజికానుమతీ ఏవిధంగా ఆపాదింపబడిందో ఆయన వివరించారు. అదే విధంగా ఇతర ప్రాంతాల్లో జరిగిన సామాజికోద్యమాలనూ, మార్క్స్, ఏంగెల్స్ వంటి ఇతర పాశ్చాత్య సిద్ధాంత వేత్తల రచనలనూ ఆయన అధ్యయనం చేశారు.

అయితే రచయిత తెలుగు గడ్డ మీద పుట్టిన వాడవడం చేత తెలుగు సీమలోని సామాజిక ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితులే ఈ గ్రంథంలో ఎక్కువగా ప్రతి ఫలించాయి. అయితే సాధారణ సూత్రాలు అన్ని ప్రాంతాలకూ అన్వయం అవుతాయి. అయితే ఆయా ప్రాంతాల్లోని వివిధ సంస్కృతులు సంప్రదాయాలు ఒక దానికి ఒకటి భిన్నంగా ఉంటాయి. పద్మారావుగారికి ఉత్తేజాన్నీ, స్ఫూర్తినీ ఇచ్చే అంశం డాక్టర్ అంబేద్కర్ వ్యక్తిత్వం, ఆయన తత్వ శాస్త్రం.

ఈ పుస్తకం కుల నిర్మూలన కోసమే కాక ఒక సాంస్కృతిక ప్రత్యామ్నాయాన్ని ప్రతిష్ఠించడానికి కూడా పూనుకుంటుంది. వాల్మీకి రామాయణాన్నీ, భగవద్గీతనీ ఇతర మత సాహిత్యాన్నీ విమర్శనాత్మకంగా విశ్లేషించిన ఈ గ్రంథం హేతు బద్ధంగా వుంది. అంతే కాకుండా గుప్తుల కాలం వంటి చారిత్రిక యుగాలనూ, మానవత్వాన్ని ప్రబోధించిన భక్తి ఉద్యమాలనూ, ప్రత్యేకించి

మహారాష్ట్రంలో సంఘ సంస్కరణ కోసం ఉద్యమించిన జ్యోతిబా పూలే, పెరియార్, దళిత్ పాంథర్స్ సాంస్కృతిక ఉద్యమాలనూ ఈ పుస్తకం విశ్లేషించింది.

భారత దేశంలో కులం పుట్టుక, అభివృద్ధిని గురించి రాస్తూ ఆయన జి.ఎస్.గురెయ్ అభిప్రాయాన్ని ఉల్లేఖించారు. ''నా అభిప్రాయం ప్రకారం భారత దేశంలో కులం ఇండో ఆర్యన్ సంస్కృతికి పుట్టిన బ్రాహ్మణ శిశువు, అది మొదట గంగా యమునా ప్రాంతంలో ఊయలలూగి, ఆ తర్వాత దేశమంతటా వ్యాపించింది.''

భారత దేశంలో స్వతంత్రం వచ్చిన తర్వాత కులం చైతన్యం నానాటికి క్షీణించాల్సింది పోయి మరింత పెచ్చరిల్లింది. అధికార రాజకీయాలన్నీ కులంపైన ఆధారపడినవే కావడం దానికి కారణం. ఈ కులాధిపత్యం కేవలం బ్రాహ్మణులకే పరిమితం కాలేదు. అది బ్రాహ్మణేతర భూస్వామ్య కులాలకూ వ్యాపించింది. ఈ కులం జాడ్యం కమ్యూనిస్టు ఉద్యమానికీ వ్యాపించడం గమనార్హం. నిజానికి కులానికీ, వర్గానికీ వ్యతిరేకంగా ఉద్యమించే కమ్యూనిస్టు ఉద్యమంలోనూ నాయకత్వం అగ్రవర్ణాల చేతుల్లోనే వుంది. కమ్యూనిస్టు నాయకుడైన ఇ.యం.ఎస్. నంబూద్రిపాద్, మహాత్మాపూలే, అంబేద్కర్‌లను కేవలం 'సంఘ సంస్కర్త'లుగా కొట్టి పారేశాడు. మాజీ కమ్యూనిస్టయి శరద్ పాటిల్ దీనిపైన ప్రతి స్పందిస్తూ ''అంబేద్కర్ తన 'స్టేట్ సోషలిజం'లో భూమిని జాతీయం చేయాలని అన్నారు. భూమిని జాతీయం చేయకుండా కులాన్ని అంతం చేయలేం. ఈ విషయాన్ని గుర్తించడం ద్వారా అంబేద్కర్ మరింత ఉన్నతమైన తాత్విక దశకు చేరుకున్నారు. దీని ద్వారా మనకు అంబేద్కర్ కేవలం భావజాల కర్తే కాదనీ, ఒక తత్వవేత్తనీ అర్థమవుతుంది. నేను అంబేద్కర్ తత్వ శాస్త్రాన్ని ''సామ్యవాద గతి తార్కిక వాస్తవిక వాదం'' అని పిలుస్తాను'' అని రాశారు.

హిందూ మత సంస్కృతికి తన అమ్ముల పొదిలో అనేకమైన ఆయుధాలున్నాయి. ఒక ఆయుధం ఏమిటంటే తనను వ్యతిరేకించేవారిని కూడా తమలో భాగంగా చేసుకోవడం. ఉదాహరణకు హిందూ మతాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన బుద్ధుడ్ని దశావతారాల్లో ఒకరిగా చేసారు. ఇటువంటి ఉదాహరణ లెన్నింటినో ఈ పుస్తకంలో పద్మారావుగారు ఇస్తారు. ఆర్యుల పెత్తనం ఏవిధంగా విస్తరిస్తూ వచ్చిందో రామాయణంలో ఆయన ఉదాహరణలు చూపించారు. పితృస్వామ్యం భారత సమాజాన్ని ఏవిధంగా కబళించి వేసిందో ఆయన సోదాహరణంగా వివరించారు భారత సమాజంలో కులానికి ప్రత్యామ్నాయాలను సూచించే క్రమంలో పద్మారావుగారు జపాన్ మేధావి నకమీ కూడా రాసిన ''ఇండియన్ బుద్ధిజం'' అనే గ్రంథం నుండి ఉల్లేఖనలను తీసుకున్నారు.

''ప్రాచీన బౌద్ధ మతంలో మనం సామాజిక అవగాహనను చూడవచ్చు. బౌద్ధం మనుష్యులందరూ సమానులేనని చాటి చెప్పింది. కుల వ్యవస్థను తిరస్కరించింది. స్త్రీలు పురుషులతో సమానమని చెప్పింది. నీతి సూత్రాలను బౌద్ధం బోధించింది''.

స్వామి రామానంద తీర్థ తన ''హిందూ సామ్రాజ్యవాద చరిత్ర'' అనే గ్రంథంలో ''భారత దేశంలో బౌద్ధం జాతీయ మతంగా విలసిల్లింది, బౌద్ధ కాలం భారత దేశంలో జాతీయతా భావాలు వికసించిన కాలం, భారత దేశం స్వేచ్ఛకూ, సార్వ భౌమాధికారానికి అశోకుని పరిపాలన ప్రతీకగా నిలుస్తుంది'' అని రాశారు.

నలంద, తక్షశిల, వల్లభి వంటి ఎన్నో బౌద్ధ విశ్వ విద్యాలయాలు ఎంతో ఉన్నతమైన సంస్కృతినీ, కళల్నీ, అభివృద్ధి చేశాయి. సజీవమైన విద్యా వ్యాప్తికి కృషి చేశాయి, అయితే వీటిని హిందువులలో ఛాందసులే కాక ముస్లిం దురాక్రమణ దారులు కూడా నాశనం చేశారు. ఈ

బౌద్ధ విద్యాలయాల స్ఫూర్తితోనే డాక్టర్ అంబేద్కర్ బొంబాయిలోనూ ఇతర ప్రాంతాల్లోనూ విద్యా సంస్థల్ని స్థాపించారు.

హిందూ కుల వ్యవస్థకు ప్రత్యామ్నాయాలను గురించి ఆలోచించే క్రమంలో పద్మారావుగారు హిందూ మతంలోనూ, ముస్లిం మతంలోనూ వచ్చిన భక్తి ఉద్యమాలు ప్రబోధించిన మానవతా వాదాన్ని ఉదహరిస్తారు. కబీర్, వలి దాస్, సాధన చైతన్య, గురునానక్, నామ్‌దేవ్, తుకారాం మొదలైన వారిని ఆయన అధ్యయనం చేశారు. అదేవిధంగా ఆంధ్రాలో వేమన, అన్నమాచార్య, వీర బ్రహ్మేంద్ర స్వామి, కర్నాటకలో బసవలను అధ్యయనం చేశారు.

ధనంజయకీర్ రాసినట్లుగా ఫూలే స్థాపించిన సత్య శోధక సమాజం రైతు కూలీల్లోనూ, అణగారిన జనాల్లోనూ ఆత్మ గౌరవ చైతన్యాన్ని రగిలించింది, ఫూలే వారిలో ధైర్యాన్ని కలిగించారు, పేదరికానికీ, సామాజిక అన్యాయానికీ, అన్యాయమైన కుల వ్యవస్థ అణచి వేతకూ వ్యతిరేకంగా ఉద్యమించేందుకు ఆయన ప్రజల్ని తీర్చి దిద్దారు.

ఇ.వి. రామస్వామి నాయకర్ ఇంకా ముందుకు వెళ్ళారు. ''నేను సజీవంగా ఉన్నాను కాబట్టి నా జీవితానికొక పని కావాలి. పని లేకపోయే జీవితమే లేదు, నా ఉద్యమాన్ని నేనే నిర్ణయిస్తున్నాను. నేను కులానికీ, మతానికీ వ్యతిరేకంగా ఉద్యమించాలని నిర్ణయించుకున్నాను'' అన్నారు. మనం స్వేచ్ఛగా వుండాలంటే మన స్త్రీలు స్వేచ్ఛగా వుండాలని వారికీ పురుషులతో సమానమైన హక్కులు ఇవ్వాలనీ ఆయన అన్నారు

మను ధర్మ శాస్త్రం బ్రాహ్మణులు కింది వర్ణాల వారిని అణచి వేయడానికి ఒక దుర్మార్గమైన ఆయుధంగా ఉపయోగ పడిందని పద్మారావుగారన్నారు.

దళిత పాంథర్స్ సృష్టించిన సాహిత్యం మూడు ప్రాథమికమైన ఆధారాలను మన ముందుంచింది. 1 శాస్త్రీయమైన ప్రతి స్పందన 2) విశ్వసనీయమైన ప్రాపంచిక దృక్పథం 3) విప్లవాత్మకమైన ఆచరణ.

చరిత్ర పుటల్లోకి వెళ్తే అనేక అంశాలు మన ముందుకొస్తాయి. చార్వాకుల భౌతిక వాదం అందులో ఒకటి. రెండవది బౌద్ధుల సంఘ వాదం. దాన్ని ఆర్యులు ధ్వంసం చేశారు మూడవది భక్తి ఉద్యమ కారుల మానవతా వాదం. వీళ్ళందరూ సమాజంలోని కింద వర్గాల నుండి వచ్చినవారే.

ఒక ప్రత్యామ్నాయ సంస్కృతిని గురించిన ఆలోచన లేకుండా ఉన్న సంస్కృతిని కూల దొయ్యలేము. పద్మారావుగారు దీనికోసం అనేక అంశాలున్న కార్యక్రమాన్ని రూపొందించారు.

1. కులాంతర వివాహాలను ప్రోత్సహించడం. 2 ప్రతి గ్రామములోను కులాంతర వివాహ వేదికలను నిర్మించడం. 3. శర్మ, శాస్త్రి, చౌదరి, రెడ్డి, రాజు, నాయుడు వంటి కుల చిహ్నాలను తొలగించడం. 4. కులాంతర వివాహాల సందర్భంగా వార్షికోత్సవ వేడుకలు జరపడం. 5. వరకట్నాన్ని నిషేధించడం. 6. అనులోమ వివాహాలకు ప్రతిగా ప్రతిలోమ వివాహాలు జరపడం.7 పెండ్లి మంటపాలను తొలగించడం. 8. ఆయా కులాలకు కేటాయించిన నీచమైన వృత్తులను వదిలి వేసి విద్యా వంతులను చేయడం. 9. సంకుచితమైన సంస్కృతి స్థానంలో విశాలమైన మానవతా వాదాన్ని స్థాపించడం

ఈ కార్య క్రమం కొనసాగడం మంచిదే, అయితే సామాజిక విప్లవానికి ఈ పద్ధతే అనుసరణీయమైనదా అన్న ప్రశ్న ఉద్భవిస్తుంది. దాంతో పాటుగా ఇప్పటి వరకు వెలివేసినట్లు చూడబడిన కులాలు ఆధిక్యతా భావాన్ని పెంచుకుంటే సరిపోతుందా లేక కులాలు లేని సమాజాన్ని స్థాపించుకోవాలా అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

చివరిగా మనిషి కేంద్రంగా గల మానవతా సంస్కృతిని కావాలనుకుంటున్నామా లేక ఆధిపత్యం వహించే ఒక మతం స్థానంలో మరో మతాన్ని ఉంచాలను కుంటున్నామా? ఇది ప్రతి పాఠకుడూ, పాఠకురాలూ తనకు తాను సమాధానం చెప్పుకోవలసిన ప్రశ్న. .

☆

# వేప గింజ బహుతీపి !

## ( జన్యుశాస్త్రంలో అమెరికా కంపెనీల సామ్రాజ్య వాదధోరణి)

వేపచెట్టు మహాత్యాన్ని తెలియని వారు భారత దేశంలో ఉండరు. అది సర్వ విదితం.వేపచెట్టు ఈ దేశంలో ఆరాధ్యమైనదే కాక ఆరోగ్య ప్రదాయినీ అన్న ప్రఖ్యాతిని పొందింది.

వేప చెట్టును సర్వరోగ నివారిణిగా అందరూ భావిస్తారు. శతాబ్దాల తరబడి వాడుకలో ఉన్న ఈచెట్టు నిత్య జీవితంలో ఎక్కడో అక్కడ ఎల్లప్పుడూ ప్రతివారికి ఉపయోగ పడుతూనే ఉంటుంది. వేరునుంచి మొదలుకొని అతిసూక్ష్మమైన పూరేకుల దాకా, చెట్టు పట్టానుంచి పండ్లు గింజలదాకా ఆవృక్షంనుంచి వచ్చేవి అన్నీ ఔషధాలే. దేహ ఆరోగ్యానికి రక్షణగా నిలబడడమే కాక జంతువృక్షాదుల ఆరోగ్యాభివృద్ధికి కూడా వేపచెట్టు సహాయకారి. పురుగుల బారినుండి రక్షించే పెస్టిసైడ్‌నూ, మొక్కలు ఏపుగా పెరిగేందుకు ఎరువునూ ప్రసాదించే శక్తివంతమైనది వేప చెట్టు. ఆ విధంగా దైనందిన జీవితంలో భాగమైన వేప చెట్టు ఈమధ్య పెద్ద వివాదానికి గురి అయింది.

కారణం: వేప గింజలనుంచి సాధించిన ఒక రసాయనాన్ని అమెరికన్ కంపెనీ ఒకటి పేటెంట్ చేసింది. పేటెంట్ చేయడం అంటే పేటెంటును పొందినవారు మినహా ఇతరులు ఎవ్వరూ ఆ రసాయనాన్ని తయారు చేయరాదు, మార్కెట్‌లో దానిని అమ్మరాదు. పేటెంట్ పొందిన వారి అనుమతి లేకుండా ఆ రసాయనాన్ని ఉపయోగించరాదు. పేటెంటు కలిగిన రసాయనాన్ని వాడుకోవాలంటే పేటెంట్ పొందిన కంపెనీ నుంచి వారు అడిగే ధరకు ఆవస్తువును ఖరీదు చేసుకొని ఉపయోగించు కోవాలి. ఇక్కడ పేటెంటు పొందిన కంపెనీ W.R. గ్రేస్ అండ్ కంపెనీ, పేటెంటును ఇచ్చినది అమెరికన్ ప్రభుత్వం. గ్రేస్ కంపెనీకి ఇటువంటి అకృత్యాలు చేయడం మొదటి సారికాదు. కొద్దిసంవత్సరముల క్రితం ప్రత్తి మొక్కను గురించి గ్రేస్ కంపెనీ పొందిన పేటెంట్‌ను భారత ప్రభుత్వం రద్దుచేసింది.

వేప గింజల రసాయనాన్ని గురించి గ్రేస్ కంపెనీ సాధించిన అమెరికన్ పేటెంట్ మనను ఇప్పుడు బాధ పెట్టేది కాదు. ఎందుచేతనంటే, అమెరికన్ పేటెంట్లకు ఇండియాలో గుర్తింపులేదు. కానీ గ్యాట్ ఒప్పందం వలన మనకు అమెరికన్ పేటెంట్‌ను గుర్తించ వలసిన అవుసరం ఒకటి కలిగింది. గ్యాట్ ఒప్పందం షరతుల ప్రకారం భారత దేశం 10 సంవత్సరములలోపల విదేశీ పేటెంట్లకు గుర్తింపును ఇవ్వాలి. ఈపది సంవత్సరములలోపల భారత దేశం విదేశీ పేటెంట్లకు గుర్తింపును ఇచ్చేవిధంగానూ మన ప్రజా అవుసరాలకు అనుగుణ్యంగానూ ఉండే ఒక పేటెంట్ చట్టాన్ని రుపొందించు కోవాలి.

ఇక్కడ చాలా ముఖ్యమైన సమస్య ఒకటి ఉంది. మనుష్య, జంతు, వృక్షాదులకు ప్రతి సృష్టిగా చేసే నూతన కల్పనలకు పేటెంట్ ఉండరాదు అనేది విజ్ఞుల అభిప్రాయం. దానికి భిన్నంగా ఆప్రతి సృష్టికి పేటెంట్లను ఇవ్వ వచ్చును అనేది మరొక వాదన. సృష్టిని మార్పుచేసే కల్పనలకు పేటెంట్లను ఇస్తే అదిచాలా ప్రమాద కరమని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

ఇది ఇట్లుండగా పేటెంట్‌ను పొందేందుకు మరికొన్ని షరతులు ఉన్నాయి. పేటెంటు కొరకు

కల్పించే ప్రక్రియ ఒక నూతన కల్పన అయి ఉండాలి అది సృష్టిలో లేనిది, సృష్టిని మలుపుతిప్పేది అయిఉండాలి. దీనిని ఇన్వెన్షన్ (invention) అంటారు. సృష్టిలో ఉన్నదానినే క్రొత్తగా కనిపెడితే అది ఉన్న దానినే బహిర్గతం చేయడం క్రిందకు వస్తుంది.

అది డిస్కవరీ (discovery). డిస్కవరీకి పేటెంటు లేదు. ఇన్వెన్షన్‌కు మాత్రమే పేటెంటును పొందే అర్హత ఉంది. కల్పన చేసిన ప్రతి ప్రక్రియకూ పేటెంట్ ఉండదు. ఇన్వెన్షన్ కూడా క్రొత్తదీ అంతకు ముందు ఎవ్వరికీ తెలియనిదీ అయి ఉంటే తప్ప పేటెంట్ లభించదు.

వేపచెట్టు రసాయనానికి ఈ రెండు అర్హతలు లేవు. వేప చెట్టు ఉపయోగాలను గురించి, వేప చెట్టులోని ప్రతి భాగం ఒక ఔషదం అన్న విషయం ప్రపంచ విదితం.

అందుచేత వేపచెట్టు గింజలనుంచి లభ్యపరచుకున్న రసాయనం ఒక నూతన కల్పనకాదు.

ఈ కారణాలవలన అమెరికన్ ప్రభుత్వం గ్రీస్ కంపెనీకి ప్రసాదించిన పేటెంట్ న్యాయ శాస్త్రరీత్యా ధృవ పడకపోవచ్చు. దాదాపు రెండు వందల యాభయిమంది శాస్త్రజ్ఞులు ఇతర సంస్థలు అమెరికన్ పేటెంట్‌ను రద్దు పరిచారి అని చేస్తున్న అందోళన విజయవంతం అయే సూచనలే ఎక్కువగా ఉన్నాయి.

వర్ధమాన దేశాలలో ప్రత్యేకంగా ఉష్ణ దేశాలలో వేప చెట్టువంటి వృక్షాలు చాలా ఉన్నాయి. అభివృద్ధి చెందిన దేశాలు పేటెంట్ ద్వారా ఈ సంపదను హస్తగతం చేసుకొంటే వర్ధమాన దేశాలకు చాలా నష్టం వాటిల్లవచ్చు అందుచేత భారత దేశం తయారు చేయబొయే పేటెంట్ చట్టంలో ఈ విషయంగురించి కూడా స్పష్టమైన షరతులు ఉండాలి.

విదేశీ పేటెంట్లను గుర్తించ వలసి వచ్చిన అవుసరం దృష్ట్యేనూ, దేశంలోని genetic and biological సంపదను విదేశీయులు కొల్లగొట్టడాన్ని నిరోధించే నిమిత్తమూ మన దేశం తయారు చేయబోయే పేటెంట్ చట్టంలో ఈ క్రింది విషయాలపై షరతులు విధిగా ఉండాలి.

1. భారత దేశంలోని genetic and biological సంపదను ప్రభుత్వ అనుమతి లేకుండా ఇతర దేశాలకు ఎవ్వరూ తరలించరాదు

2. భారత genetic and biological సంపద ఆధారంగా సంపాదించే పేటెంట్లవలన లభ్యపడే రాయల్టీలో భారత దేశానికీ కొంత భాగం ఉండాలి

3. పేటెంట్ పొందిన వారు పేటెంట్‌ను దుర్వినియోగపరిస్తే, అనగా పేటెంట్ పొందిన వస్తువును ప్రజలకు అందచేయక పోయినా లేక ఆవస్తవుల ధరలను పెంచినా, వాటి నివారణకు తగుచర్యలు తీసుకొనే అధికారం భారత ప్రభుత్వానికి ఉండాలి

ఈ షరతులను గురించి చాలాచోట్ల అభివృద్ధి చెందిన దేశాలకు వర్ధమాన దేశాలకు మధ్య చర్చలు జరుగుతున్నాయి. కొన్ని చోట్ల ఒప్పందాలు కూడా ధృవపడినాయి. కనుక భారత దేశం కూడా ద్వైపాక్షిక ఒప్పందాల ద్వారా తగు ఏర్పాటులు చేసుకోవడంలో ఏమరుపాటు ఉండరాదు.

✯

# HEANEY, SEAMUS

## NOBLE PRIZE WINNER (1995)

Irish. Born in Castledawson, Country Derry, Northern Ireland, 13 April 1939. Queen's University, Belfast, 1957-61, B.A. (honours) in English 1961; St. Joseph's College of Education, Belfast, 1961-62, Cert. Ed. 1962. Married Marie Delvin in 1965; two sons and one daughter. Teacher, St. Thomas's Secondary School, Belfast, 1962-63; Lecturer, St. Joseph's College of Education, Belfast, 1963-66; Lecturer in English, Queen's University, 1966-72; Guest Lecturer, University of California, Berkeley, 1970-71; moved to Country Wicklow, Republic of Ireland, 1972; did regular radio work, and teaching at American universities; teacher, Carysfort Training College, Dublin, 1975-81; Allott Lecturer, University of Liverpool, 1978. Visiting Professor, 1982-84, and since 1984 Boylston Professor of rhetoric and oratory, Harvard University, Cambridge, Massachusetts. Since 1989 Professor of poetry, Oxford University. Recipient: Eric Gregory award, 1966; Cholmondeley award, 1967, Faber memorial prize, 1968; Maugham award, 1968; Irish Academy of Letters award, 1971; Denis Devlin memorial award, 1973, 1980; American-Irish Foundation award, 1975; American Academy E.M. Forster award, 1975; Duff Cooper memorial award, 1976; Smith literary award, 1976; Bennett award, 1982; P.E.N. prize, for translation, 1985; Whitbread award, 1987; Sunday Times Month Blanc award, 1988. D.H.L.: Fordham University, Bronx, New York, and Queen's University, Belfast, both 1982. Member, Irish Academy of Letters.

The poet digs with his pen as father and grandfather dug with their spades the rich peat of Ireland. Violence is hinted at by the simile which adds a third implement to the human repertoire (""The squat pen rest; snug as a gun"). The title poem of Death of a Naturalist extends this menace, recalling the poet as a boy sickened by the pools of frogspawn which tell of a repulsive world beyond the human: "The great slime kings/ Were gathered there for vengeance and I knew/That if I dipped my hand the spawn would clutch it." Throughout this volume the water-rat recurs as image of an alien yet terrifyingly familiar world, a world finally admitted, in "Personal Helicon," to be close to the poet's own creative springs, as, "pry(ing) into roots... finger(ing) slime," this "big-eyed Narcissus" is startled by a rat that ""slapped across my reflection."

Poetry itself is a "door into the dark" where we seek our own carnal origins, and "Bogland" and "Bann Clay" stress this symbolic digging for a lost, primordial centre of being:



*Round Table Conference in London in 1931. To Mahatma Gandhi's right, Lord Sankey, Sir Samuel Hoare, Ramsay MacDonald*